మాసపత్రిక. శ్రీ చందా రు 3-0-0.

# వజ్రాయుధము

(నెల కొకసారి ప్రచురింపఁబడును)

సంపాదకులు,
కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.
రాజమహేంద్రవరము.

సంపుటము 1. | జనవరి ౧ 1925. | సంచిక 1.

"ఇదం కవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే
విందేమ దేవతాం వాచ మమృతా మాత్మనః కలామ్"

## స్వవిషయము.

ఆర్యులార! భాషాభిమానులారా!

వర్షారంభమునఁ గుక్కగొడుగులవలె నిప్పుడు మనదేశములో ననేకాంధ్రపత్రికలు బయలుదేఱినవి. బయలుదేఱుచున్నవి. వానిలోనివిషయములేగాక నామకరణములును నవ్వుపుట్టించునట్లే యున్నవి. ఇది యంతయు నాకుఁ జూడఁజూడ వేలమువెఱ్ఱిగాఁ గానుపించుచున్నది. ఈసందర్భమున నాకుఁ దొంటిప్రొవిడెంటుకంపెనీలు స్ఫురణమునకు వచ్చుచున్నవి. అందుఁ గొన్నికొన్నిపత్రికలలో సెంకిపాటలు, ఎల్లిపాటలు గ్రామ్యభూయిష్ఠములై యుండుటయే గాక యపాత్రములైనప్రతిమలును ముద్రింపఁబడుచున్నవి. అది బంగాళా ఆర్టని చెప్పుచున్నారు. నే నొకపత్రికపై సరస్వతీవిగ్రహమును జూచినాను. ఆమె మనకుఁ దల్లిగదా! అట్టితల్లిబొమ్మ యసభ్యముగా నున్నం గనినవారి కెట్టిచిత్తము పుట్టునో మీరే యూహింతురుగాక. ఇదిగాక "తల్లికి మగఁడు, పట్టపగలుటపాకాయ" మొదలగు నపాత్రపుపేర్లతోఁ బెక్కులు గ్రంథములు పుట్టుచున్నవి. గ్రామ్యభాష ప్రబలుచున్నది. "గతానుగతికో లోకః" అనునట్లు గ్రాంథికభాషాగ్రహణకష్టమునకుఁ బాల్పడ నేరనిపామరు లందఱు నాగ్రామ్యమును

భాషించి భూషించుచున్నారు. కొందఱు భావకవిత్వము లని యభావ కవిత్వము నభ్యాసము చేసి ప్రకటించుచుందముకుఁ జాలినవా రెవ్వరును లే రని గర్వించుచున్నారు. ఇత్యాదులం బురస్కరించుకొని నేను సర్వవిధముల నసమర్థుఁడనై యున్నను, ఈపత్రికను నెలకొల్ప వలసినవాఁడ నైతిని. ఇందు ముఖ్యముగా గ్రామ్యమును నిరసించుటయే ప్రధాన కార్య మని నిర్ణయించుకొంటిని. ఇందు మఱికొన్ని విమర్శనములు, ప్రబంధములు లోనగునవి ప్రచురించుటకు సంకల్పించుకొంటిని. దీనివలన నా భారతరచనకు నంతరాయ మగు నని యెఱుంగుదును. అయినను లోకముపై భారము వైచి, పరమావశ్యక మని యిక్కార్యమునకుం గడంగితిని. చందాదారులు రా కున్నను నేను దీని నొకసంవత్సరము మాత్రమైనఁ గొనసాగింపక మానను. తొల్లి కళావత్యాదిపత్రికలకు వేలకు వేలు వెచ్చించినవాఁడను. ఈస్వల్పమునకు వెనుదీయను. భిక్షాటనము చేసియైన దీనిని నడపింతును. ఈపత్రికకుఁ జందాదారులుగా భాషాభిమాను లెల్లనుందు రనియే నానమ్మకము. లేకున్నను లేకుందురు గాని నేను మాత్రము భాషాద్వేషుల నాశ్రయించి చందాలం బోగుచేసికొనుటకుం బ్రయత్నింపను. ఇష్టము వచ్చినవారు నాపత్రిక నాదరింపవచ్చును. లేనివారు మానవచ్చును. నేను బట్టినపట్టు విడువక యీపత్రికను నిర్విఘ్నముగాఁ గొనసాగించునట్లు దైవమును బ్రార్థించుచున్నాను.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

---

వజ్రాయుధము.

ఈపేరుతో మే మొక తెలుఁగుమాసపత్రికను 1925 సం॥రము జనేవరి నెల మొదలుకొని రాజమహేంద్రవరమునుండి ప్రచురించుచుంటిమి. 50 రాయల్ పుటలకుఁ దక్కువగానిపుస్తకముగా నుండును. వీలునుబట్టి చిత్రపటములు నిందుఁ జేర్పఁ బడుచుండును.

తొల్లి ప్రావిడెంటుకంపెనీలవలె ఇప్పుడు వేలమువెఱ్ఱిగా నెల్లిపాటలతో నెంకిపాటలతో నిండి గ్రామ్యభూయిష్ఠములై పెక్కుపత్రికలు పుట్టినవి. పుట్టుచున్నవి. "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" అని ప్రసిద్ధిగాంచిన గ్రాంథికభాషకుఁ గళంక మేర్పడుచున్నది. ఆ కారణముచేతనే మాకు

## విషయసూచిక.



---

## హి త బో ధ న ము .

ఓ కొరడాపత్రికాధిపతులుగారూ!

1925 సం॥రము జనవరి 10 వ తేదీని మీకొరడాలో మీ కొకస్వప్నము వచ్చినట్లు వ్రాసినారు. అందు—"మొన్న రాత్రి నా కొకచిత్రమైనకల వచ్చింది. కలలో మొదట కవిరాజుగారు కనబడ్డారు వారి మొగం ఎర్రబారివున్నది. నరములు వుబ్బినవి. ఊరక రోజుతున్నారు చేతు లటూ ఇటూ విసురుతున్నారు. ఇంతలో వున్నట్టే వుండి శాస్త్రిలుగారు మారి పోయి దేవేంద్రు డయినారు. చేతిలో వజ్రాయుధం వున్నది. దాన్ని ఝళిపిస్తూ" ఓరోరీ గ్రామ్యవాదులారా కలియుగరాక్షసులారా! ఇదిగో వజ్రాయుధము. దీనితో మీపక్షములను ముత్తునియల గావించెద. కాచుకోండు. జాగ్రత్త! అంటూ గర్జించారు" అని. ఈస్వప్నము మనమిత్రులకు మంచిదో చెడ్డదో యని నేను గ్రంథము లన్వేషించితిని. అన్వేషింపఁగా బ్రాహ్మణుఁడు కవిరాజు, కలలోఁ గన్పించుట, వాని మొగ మెఱ్ఱఁబాఱి యుండుట, నరము లుబ్బియుండుట, రోఁజుచుండుట, ఇటు నటు చేతులు విసరుకొనుచుండుట, చేతిలో వజ్రాయుధ ముండుట, దానిని ఝళిపించు చుండుట, దానితో మీపక్షములు ముత్తునియలు గావింతు ననుట, కాచుకొనుఁడని గర్జించుట, ఈమొదలగునవి మీకు మిక్కిలి యరిష్టసూచకము లని స్వప్నప్రకాశికలోఁ దెలియ వచ్చినది. "శ్లో॥ దేవద్విజాదిభూపానాం ప్రజానాం క్రోధ ఏవచ। ఏవమాదీని చాన్యాని దుస్స్వప్నాని వినిర్దిశేత్। కరాళై ర్వికటైః కృష్ణైః పరుషై రుద్యతాయుధైః। పాషాణై స్తాడ్యతే స్వప్నే సద్యో మృత్యుం లభే న్నరః॥ రక్తకృష్ణాంబరధరాః॥ వ్యఙ్గాంశ్చ వికృతాః కృష్ణా స్సశస్త్రా న్సాయుధా నపి। స స్వప్నే లభతే వ్యాధిం రోగీ యాత్యేవ పంచతాం॥" ఇట్లున్నది. దీనికి మీ రుపశాంతి చేసికొనఁ గోరుదురేని "పఠేత్ స్తోత్రాణి దేవానాం రాత్రౌ దేవాలయే వసేత్" దేవతాస్తుతులు, విష్ణుసహస్రనామములు, కృష్ణసహస్రనామములు లోనగునవి పఠించుచు దేవతాదర్శనము చేసి మీరు మీదుస్స్వప్నఫలమును బొందకుందురుగాక.

"దృష్టశ్శ్రుతోనుభూతశ్చ" ఇత్యాదిసప్తవిధము లయినస్వప్నములు రాబోవుశుభాశుభములను దెలుపునవియై యుండును. మీకీస్వప్నము ఆంధ్రపత్రికవలన దృష్టమైనది. అదియే మీ కింతతొందరపాటును గలిగించినది. దీనిమాటకేమి గాని కొరడాపత్రికాధిపతిగారూ! లోకములోఁ బరిహాసరూపకరచన మీకే చేతనగు ననుకున్నారా? మఱియెవ్వరు మీవలె వ్రా

యులే రని మీయభిప్రాయమా? మీరు పత్రికను బ్రారంభించినది మొదలుకొని యెంత లెంతలనైన నిట్లు పరిహసించుచున్నారు. పత్రికాధిపతులు చేయవలసినవిధాన మిట్టులేనా? ఇదియా మీవిజ్ఞానము? ఇట్లేనా జనసామాన్యమును బోధించుట? ఇట్లున్న మీపత్రిక పైకెత్త పుట్టక పోవునా? మీకుం దెలియకున్న నితరపత్రికాధిపతులను జూచి యైన నేర్చుకొనరాదా? వజ్రాయుధమును ధరించి మీపక్షములు ముత్తునియలు గావింతు నన్న దేవేంద్రుడు చెవిటిముసలివాని ప్రేత తాటియాకు పాత్ర కాలికట్టలు చూచినంతమాత్ర భీతుండై తెల్లమొగము వేసికొని చేతిలోని వజ్రాయుధము జాఱ విడిచునా? తాటియాకు పాత్రము విష్ణుచక్రమా? మీముసలాయనను గాని వారిపుస్తకాలను గాని వారి పాండిత్యము గాని యెవరెఱుంగకున్నారు? శ్రీకృష్ణభారతపత్రికలలో నిప్పుటలు తిరుగ వేసినంత మాత్రమున శ్రీకృష్ణుఁడు భీతిల్లు నని మీ ఎంకమీఁద వచ్చుకలలలో నైనఁ దలంపకుఁడు. శ్రీకృష్ణునిచేత నాయాసాధనసామగ్రి యంతేయు నున్న దనియే నిశ్చయించుకొనుఁడు. ఓయి వెఱ్ఱిమిత్రమా! వజ్రాయుధము నే నెందులకుఁ బూనవలసివచ్చెనో? గరుత్మంతుం డూరఁబిచ్చుకలపైఁ బడినట్లు తోచినట్లు వ్రాయువృత్తాంతపత్రికలపైఁ బడునోటు? ఏమిపని చేయునదియో! యెట్టిదియో? తెలిసికొనక యది వెలువడకమున్నె దానిపేరు పత్రికలోఁ జూచినంతమాత్రమున నే పరపిల్లి యిట్లు దురభిప్రాయపడి పరిహసించుట పత్రికాధిపతి యైనవానికి లక్షణముగా దని బోధించుచు నిప్పటికింతటితో విరమించుచున్నాను.

### ఆంధ్రగీర్వాణపాఠశాల,—కొవ్వూరు

మొన్న వైకుంఠైకాదశినాఁడు విద్వత్పరీక్షలు జరిగినవి. వేదశాస్త్ర విద్వాంసులకు సమ్మానముచేయఁబడినది. మూఁడు దినములు సభలు జరిగినవి. నిరటికంటె నీయేఁడు మిక్కిలి చక్కఁగా భోజనభాజనాది సత్కారము జరిగినది. ఈయేటికంటె బయినుండి మఱింత సర్వోచ్చముగా జరుగుఁగాక యని పరమేశ్వరుని బ్రార్థించుచున్నాము.

### మేడూరి నాగేశ్వరుఁడుగారు.

వీరు వెలనాటివైదికబ్రాహ్మణులు, కౌశికగోత్రజులు, ప్రపితామహులు—వేంకటనారాయణగారు, పితామహులు—శోభనాద్రిగారు, తండ్రి—సుబ్బారాయుడుగారు, తల్లి—రామమ్మగారు, కుమారుడు—విశ్వనాధముగారు, కుమార్తెలు—1 వెంకటసుబ్బమ్మ 2 అలమేలుమంగాయమ్మ వీరు ఏలూరునకు సమీపమున నున్న అనంతవాడ యనుగ్రామమునఁ గాపురంబుండి యిప్పుడు ఏలూరులో నివసించియున్నారు. వీరికి బెజవాడలో, ఏలూరులో గ్రామములో మూఁడు బియ్యపుమరలు కలవు. నరసాపురమునకు సమీపమున నున్న గొంది యనుగ్రామమును గొని జమీందారు లైరి. వీరు పుష్యశుద్ధద్వాదశినాఁడు రాజమహేంద్రవరముమార్కండేయాలయములో వేదశాస్త్రవిద్వత్సమావేశముం జేసి వారి నందఱను దగునట్లు సమ్మానించినారు. వీరిట్లు 15 సం॥రముల నుండి వేదశాస్త్రముల నాదరించుచున్నారు. వీరిం గూర్చి ముందు విపులముగా మాపత్రికయందు వ్రాయఁబడును.

శ్రీ. కృ

"వజ్రాయుధము" పూనవలసివచ్చినది. గ్రంథవిమర్శనము గావించి భాషను బోషించుటయే దీనిముఖ్యోద్దేశము గావున దీనికై మే మెట్టిశ్రమకైనఁ బాల్పడ వలసివచ్చినది. పత్రికానిర్వహణమం దెట్టికష్టమున్నదో మా కనుభవైకవేద్యము. పత్రికలు లోకులపై నాధారపడి యుండును. మన దేశ మిప్పటికిని వాని నంతగా నాదరించుస్థితిలోనికి రాలే దనుట నిర్వివాదాంశము. అది యుండనిండు.

ఈపత్రికయందలివిమర్శనములు న్యాయైకదృష్టితో శాస్త్రానుసారముగా నుండును గాని మోమోటములును విరోధములును బుచ్చుకొని యుండవు. ఇప్పటియభావకవిత్వములకును, ఏంకిపాటలకును మాపత్రిక చోటీయదు. మఱియు నిందు—ఒకమంచిప్రబంధము, ఒకమంచినాటకము, ఒకమంచికథ వైశ్యమతధర్మములు, సభ్యమై నవ్వుఁ బుట్టించునొకప్రహసనము, మొదలగునవి సందర్భానుసారముగాఁ బ్రచురింపఁబడుచుండును. దీనిం గుఱించి, మేమువిస్తరించిచెప్పుటకంటె దానిగుణముపిమ్మట పాఠకులే గ్రహింపఁగలరు. దీనికిఁజందా సం॥ర 1కి రు 3—0—0 విద్యార్థులకు స్త్రీలకు రు 2—8—0 మాత్రమే. "శాంపిలుగా ఈమొదటిపత్రికను మాత్రమే పంపితిమి. చందాదారుగా నుండఁదలఁచినవారు తమయిష్టమును దెలుపవలెను. లేనిచో పైనుండి పత్రిక పంపఁబడదు.

మేనేజరు, "వజ్రాయుధము"
రాజమహేంద్రవరము.

---

సీ. మూలమూలలఁ బడి నలపా లయిపోవ నగువిద్యలకు జీవనౌషధంబు
అజ్ఞులకుఁ బ్రాపించి సుజ్ఞానదృష్టిమై నలరంగఁ జేయుదివ్యాంజనంబు
అన్యులఁ బల్కు దేశారిష్టములనెల్లఁ బాపెడుశాంతికపౌష్టికంబు
మర్త్యలోకం బైకమత్యసుఖం బంది మానొందఁ జేయుసంధానకరణి
తే. అభిమతింపంగ వివిధవిద్యాకరము, నీతిబోధకము జగద్హితవృత్తి
విస్తృతార్థప్రదం బయి వెలయునట్టి, పత్రికారత్న మొప్పఁ బ్రపంచమందు.

# గ్రామ్యవ్యాకరణము.

## సంజ్ఞాపరిచ్ఛేదము.

గ్రామ్యము తెలుఁగుభాష కిప్పు డయోమయ విభూషణము. అది నానాజానపదసిద్ధము. శాస్త్రము నియమరహితము. గ్రామ్యభాషకు వర్ణంబులు డబ్బైపదకొండు. అ ఆ అఁ ఆఁ ఇ ఈ ఇఁ ఈఁ! ఉ ఊ ఉఁ ఊఁ! ఎ ఏ ఎఁ ఏఁ! ఒ ఓ ం ఇవి అచ్చులు. అత్తునకుఁ దప్ప దక్కినవానికి వ్యంజనేతరప్రయోగములు లేవు. పిల్లు, పీత, పూరు, వెంగి, వేలకులు, వోరి, వౌను.

హల్లులు ముప్పైమూఁడున్నర—క గ చ చ ఛ జ జ ట డ ఢ ణ త ద న ప బ మ య ర ల వ శ ష స హ ళ. ఇందు యవలు అకారేతరాచ్చులకు దగ్గఱచుట్టములు. మేనత్తకొడుకులు. యెంకయ్య, యెల్లెద్దు, వోలె వోసె ఇత్యాదులు.

ఈభాషయందు శకటరేఫార్ధానుస్వారంబులకుఁ బూర్ణానుస్వారము. ఈ యర్ధుల్లులకుఁ గొండొకచో దీర్ఘంబునకు హ్రస్వంబును, హ్రస్వంబునకు దీర్ఘంబు మఱియొకచో లోపంబుం బొటుమా అగుచుండును. వస్తాను, వస్తడు, మొ॥

విభక్తులాఱుమూఁడు—ప్రథమ—డు, వు, వ్వు; ద్వితీయ—ణ్ణి, న్ని, న్ను; తృతీయ—చేత, తో, త్తో; చతుర్థి—కోసం; పంచమి—వొల్ల, వల్ల, కంటె; షష్ఠి—కీ, కూ, ల్లో; సంబోధనము—వో, వోరే, వోసె, వోలె; ఆడు, నువ్వు, ఆణ్ణి, ఆడినిన్ని, అం చేత, బాంతో, అంనువొల్ల, ఆ వూళ్ళో, తక్కినవి యూహ్యంబులు;

క్రియలు—వస్తాను, పోతాడు, పోషిస్తారు, పోషిస్తివి, యేడిచారు, చూస్తున్నాం, సూస్తిని ఇత్యాదులు. కిలార్థకము—గందా, తక్కినవి ముందుఁ దెలియందగు.

ఈభాష బహువిధంబులు—బ్రాహ్మణగ్రామ్యము, క్షత్రియగ్రామ్యము, వైశ్యగ్రామ్యము, శూద్రగ్రామ్యము, తూర్పు—గంజాంగ్రామ్యము, దక్షిణము—చెన్నపురిగ్రామ్యము, పడమర—బళ్ళారిగ్రామ్యము, ఉత్తరము

మధురగ్రామ్యము, వైదికగ్రామ్యము, లౌక్యగ్రామ్యము, స్త్రీగ్రామ్యము, పురుషగ్రామ్యము, చెంచుగ్రామ్యము, కోదుగ్రామ్యము, కొండగ్రామ్యము, చచ్చటిగ్రామ్యము, ఎఱుకలగ్రామ్యము, ఇత్యాదులు. వస్తాడు, పల్లకుంటాడు చేసుకుంటున్నా, వొచ్చింది, వస్తును, చేసుకుంటాను, అట్టవంటి, తింటాడు, హల్లో, గల్లో, గట్లా, అట్లా, గష్లా, వోవిడా, ఏమిటోయ్, వాండ్లు, కోంతి గజ్జె, గందా, ఉండాడు సాయీ మొదలగునవి గ్రామ్యంబులు.

## సంధి పరిచ్ఛేదము

ఉత్తునకు సంధి యథేష్టము—ఎల్లెద్దు+ఎక్కడ=ఎల్లెద్దెక్కడ; పెంకు+ఇల్లు=పెంకుటిల్లు; నన్ను యడిగె; అచ్చునకు వగాగమము పాక్షికము—మనము వుంటిమి, మనము యున్నాం; మొ॥

అత్తునకు సంధి నిత్యము—మా+అమ్మ=మామ్మ; మా+ఆవు=మావు; రామయ్యేడీ; గంగమ్మొచ్చింది, ఇత్యాదులు.

ఇత్తునకు సంధి యగు—యేమి+అంటావు=యేమంటావ్; మరేయ్ చూసొచ్చె, వర్తమానార్థక చు వర్ణమునకు స్వాదేశంబై సంధి వైకల్పికం బగు. సంధి లేనిచో యడాగమం బగు. వస్తావుండె, వస్తువుండె; వస్తాయుండే.

మధ్యమపురుషయందు—చివికిఁ జావ్వాదు లగు. సేవించావు, సేవిస్తావు; ప్రథమాదులందు వాఁ డాదై సంధియగు;—వచ్చాడు, వచ్చావు, వచ్చినోవనియుఁ గలదు;

క్త్వార్థకేత్తునకు సంధి నిత్యము—వచ్చిచ్చె, చేసడిగె, తినెళ్లె. ఏమ్యాదుల కేంట్యాదులై ఆద్యాదులకు సంధి యగు. అదేంటి, అదేటి, అదేంది. యనియుఁ గలదు.

ఏటేంట్యాదులకు సంధి నిత్యము—ఏటయ్య, ఏంటయ్య;

ఆ ఈ ఏ లు త్రికంబు. త్రికంబుమీఁది యచ్చు సద్విత్వంబు నొందు. ఆ+ఆవు=అఁవు. ఈ+ఈఁత=ఈఁత; ఏ+ఎలుక=ఏఁలుక; ఇత్యాదులు,

## ఆచ్ఛిక పరిచ్ఛేదము.

ఆమంత్రణంబున వోౕయి స్త్రీపుంలింగంబుల శే లే రోయి వర్ణంబులగు. వోలెంకీ, వోసెంకీ, వోగోయ్, వోఱ్ఱోయ్, బహువచనంబున నఱ్ఱాగమం బగు; పాడగట్టల్లారా, పాడగట్టల్లారాౘ, మగఁడుశబ్దంబున నాద్యంబుల కొత్వోత్వంబులగు. మొగుడు, మొగుణ్ణి, మొగుడుచేత, మొగుడుకోసం మొగుడివాల్ల

మొగుడందు, తచ్ఛబ్దార్థవాఁడుశబ్దంబున వాకు వైకల్పికంబుగ వో యగు. ద్వితీయాదుల డియు నగు. వోఁడు, వోఁడిని, వోఁడిచేత, వోఁడుకోసం, ఆఁడు, ఆఁడి వల్ల యిత్యాదులు.

దేవుఁడు శబ్దమధ్యవుకారమునకు ముకార మగు. దేముడు, దేముఁడు వోళ్లు, ప్రథమైకవచన ముకర్ణంబునకు ననుస్వారము సర్వత్ర నిత్య మగు. కర్మం, చర్మం, వనం, జ్ఞానం, గానం, మనం, పయనం, ఆకుం, మిఘం, ముత్తెం, పొగడం ॥ మొ॥ కూఁతు ర్వాదులబహువచనలకారంబునకు ద్విత్వం బగు. కూతుళ్లు, కూఁతుల్లు, అల్లుళ్లు, చెలికాళ్లు, నిట్టిళ్ళు, విలుకాళ్ళు, కూఁతురు, అల్లుఁడు, చెలికాఁడు, ఇల్లు, విలుకాఁడు ప్రభృతులు కూఁతు ర్వాదులు.

వాఁడున కా డనియు బహువచనంబున, ద్విత్వళకారంబు నగు. వాళ్లు, ఆళ్లు, వాడికి, ఆడికి, వాడిలో, వాళ్లో ఇత్యాదులు. పగతుఁడ్వాదుల బహువచనంబున, తులోపంబును వాళ్లా దేశంబు నగు. పగవాళ్లు, పొరుగు వాళ్ళు, మొ॥ కొన్నింటి ప్రథమైకవచనముల గాడు, బహువచనముల గాళ్ళును వచ్చును. వొంటిగాఁడు, వొంటిగాళ్ళు, సాహిత్యగాడు, సాహిత్య గాళ్ళు, సరివిగాఁడు, సరివిగాళ్ళు, మొ॥

జ్ఞానమునకు గేనం బ్రహ్మమునకు భెమ్మం, బ్రాహ్మణునకు భేమ్మఁడు, అయి బహువచనమున లకారశ్లిష్టరకారం బగు. భేమ్మర్లు, పురోహితాదు లకు పౌరోహిత్తుఁడు, పౌరోహిత్తులు, ఇత్యాదులు గ్రాహ్యములు.

కొన్ని దేశంబుల నీనామీలషష్ఠికి, కి వర్ణం బగు. నీకి, నాకీ, మాకి. నీవు నకు నువ్వు సర్వత్ర గ్రాహ్యము.

అమ్మ తండ్రి అన్న శబ్దములకు అమ్మ, తండి, అన్నగాఁడులు వైకల్పికంబుగ నగు. భోజనమునకు బోయనం, బోశేషంబున — బోసేసినోఁడు బోసేస్తాఁడు మొ॥-

సోమయాజులకు—సోమాదు లనియు, సో లనియు, బుల్లిరాం సోలుగారు. వెంకయ్యాదులవకారంబునకు ఎకార యకారంబులు బహుళంబుగా నగు. ఎంకయ్య, యెంకయ్య, ఎలుకాదులకు వెలుకాదులు సర్వత్ర ననుప్రయుక్తంబు లగు.

ఆడుశబ్దంబున కిత్వోత్వంబు లగు. ఆషది, ఆడిది, ఆడివారు, ఆడమనిషి మొ॥

రేఁగు, చేను ప్రభృతులౌపవిభక్తికతుల్యంబులు, రేగి, చేని; రేఁగ్వాదులపైఁ గఱ్ఱశబ్దమునకు ద్విత్వగకారంబువైకల్పికంబు. రేగ్గఱ్ఱ, గోగ్గఱ్ఱ; వికల్పంబున రేంగఱ్ఱ, గోంగఱ్ఱ, ఇత్యాదులు. షష్ఠియుం దేర్వాదుల యౌపవిభక్తికంబునకు సంయుక్తలకారం బగు. ఏట్లో, గోట్లో, పందిట్లో, పాక్షికంబుగ ననౌపవిభక్తికంబులందును—ఘంపట్లో; మొ॥

త్రాడ్వాదుల రేఫంబునకు లోపంబు నిత్యంబు. తాడు, పొఋ, పాత, బతుకు మొ॥

షకారంబునకు సకారంబు సర్వత్ర పాక్షికంబుగ నగు. విసేసాలు. తెల్లనాదుల నవర్ణలోపంబును బిందుపూర్వగవర్ణంబు నగు. తెల్లంగా, నల్లంగా, పుల్లంగా, చల్లంగా; ఇత్యాదులు.

పరిమాణార్థమైనకొలఁదికి—కొద్ది యగు; ఆడు గాలికొద్ది పనుగత్తి మోతాడు. దీర్ఘాంతంబును. కోద్ది.

బహుళంబుగా నీభాషయందు పకారంబునకు మకారం బగు. పువ్వు ముప్వు, పని, మని, పోయె, మోయె, పొయ్యాడు, పోయాడు, మోయేడు, మొయ్యేడు.

ప్రేరణార్థంచుకూర్ణంబునకు లోపంబును, లుప్తశేషంబున దిత్వంబు నగు. కావిచ్చు, చేయిచ్చు, తినిపిచ్చు; చేంచనియును—నేనాపని చేంచుతాను. ఇత్యాదులు.

మహన్మహత్త్వర్థకసర్వశబ్దార్థమైనఅందఱునకు దీర్ఘాంతంబును ధకారమధ్యంబు నగు. అంధరూ, ఇంధరూ, ఎంధ రనియును- సర్వశబ్దనపుంసకమైనఅన్నికి—అహీన్న యనియు, బ్రాహ్మణాదివ్యవహారంబుల గ్రాహ్యము.

ఉపమావాచకమైనవలెకు మల్లె ల్లా లగు వాడిమల్లె, వాడికిమల్లే, అల్లా తోటల్లా వున్నాయి. మొ

యుష్మదర్థకమైననీవునకు నువ్వను, సంఖ్యావాచకమైనఒక్కశబ్దమహదర్థమున వొండనియు, అమహదర్థమున వొటనియు సిద్ధించెడు. సంఖ్యకుఁ బూరణార్థమునం దోవి యగు. ఓటోది, రొండోది. మూడోది; అన్యాదుల యౌపవిభక్తికంబునకు, కంటె యనుప్రత్యయుక్తం బగుచో న్యాపాయంబును బిందుపూర్వంబు నగు. అంటికంటె కొంటికంటె ఇత్యాదు లూహ్యంబులు.

## కారకపరిచ్ఛేదము

ఆ డీణ్ణి కొట్టాఁడు. ఈడు గూకుంటే వోడు గూకుంటోడు. ఇవి అకర్మకసకర్మకములు; నే నెల్లి పోయొచ్చేశాను. ఇందుఁ గర్త నేను, కర్మము లేదు, వొచ్చి పోయేసి క్రియ; ఇది వచ్చితి ననుట కార్థము. సర్వత్ర గ్రాహ్యము.

సహార్థమందుఁ దృతీయాదు లగు—ఆడితో యీడు గూకున్నాఁడు, ఈడిగుండా వోడు మోత్తాడు; తద్విధార్థమైనఅట్లుశబ్దమునకు అల్లా, ఆలా, ఇల్లా, యీలా, అలగు అట్లా, యిట్లా, అట్లా గలాగు, గలగు, ఇలగు, గిలగు లోనగు రూపంబు లగు.

నిమిత్తార్థమందుఁ బంచమి యగు—నాను యెంకికోసం బాట మాడినాను. ఇందు నా నుత్తమకర్త, పాట కర్మావబోధకము, మాడినాను మధ్యమక్రియ;

లేదు కాదు పదంబుల కొకానొకచో అఁ ఆఁ! ఉఁ హూ లగు— నీ వాపని చేసినావా? అఁ ఆఁ! లే దని యర్థము; అవి సొమ్ములా? ఉఁ హూ! గుంటలు; కాదు పిల్ల లని యర్థము; కొన్నిచోట్ల, పట్టికి మట్టి యగు. చేత్తో మట్టి కాల్తో మట్టేస్తా. ఇత్యాదులు భాషాప్రపంచమునం దెలియునది. మఱియుఁ గొన్ని దేశముల వ్యవహరించుమాటలు మఱికొన్ని దేశములం దశ్లీలంబు లగు. "దొబ్బేశాడు అనునది తూర్పుదేశములో వెల్లినాఁ డనుటకును, మధ్యదేశములో హరించినాఁడనుటకు" ను వాడుదురు. ఇది మదరాసునైజాము మొదలగుదేశములలోఁ జెప్పరానియశ్లీలశబ్దార్థంబగు. "వాఁడు నిన్న పోయినాడు" వెల్లినాఁ డనియర్థము. ఇదికొన్ని దేశములలోఁ జచ్చినాఁ డని యర్థము చేకొని నిందింపఁబడు. ఆవెంకమ్మగుంట మంచిది. ఇది కొన్ని దేములలో ముద్దుమాట. కొన్ని దేశములలో నతిగర్హ్యవాక్యము. మంథెనకాళేశ్వరముతట్టున—ఆ పెండ్లిపిన్నోడు పల్లకీలో భగ్గు మంచున్నాడు" అందురు. అనఁగాఁ బ్రకాశమానముగా నున్నాఁ డని యర్థము. మనదేశములోఁ గాలిపోవుచున్నాఁ డని యర్థ మగును. ఇత్యాదు లనేకశబ్దంబులు వ్యవహారంబున నున్నవి. అవియన్నియు నార్యానార్యవ్యవహారంబులం గ్రహించి ప్రయోగించునది. ఈభాషయందు సర్వశబ్దంబులును గ్రాహ్యంబు లని యెఱుంగునది—"అపశబ్దభయం నాస్తి అప్పలాచార్య సన్నిధౌ, అనాచారభయం నాస్తి శిష్టస్మాత్రస్య సన్నిధౌ"

ఇత్యాదులు ప్రమాణంబులు.

## క్రియాపరిచ్ఛేదము.

అను తిన్వాదిధాతువుల కార్ష్యవ్యవహారంబుల అంటాడు, అంటావు, అంటడు, అంచరు, అంచారు, అన్నరు, అంటుడు, అంటును, అంటువు, అంతావు, అంతాను, అంటున్నాను, అంటున్నాక్, అంఛున్నాను, అంఛున్నామ్. తింటాను, తింతాను, తింటును, కొంటాడు, కొంటుడు, కొనేడు, తిసేడు, మొదలగునవి సుప్రసిద్ధములు. ఆర్షసమ్మతములు.

ఒకానొక ధాతువునకు నొకానొకధాతు వనుప్రయుక్తం బై యొకానొకయర్థం బగు—నా నెల్లి పో యొచ్చేశి నాను—ఇందు—ఎళ్ళి, పోయి, ఒచ్చి, ఏసి, యీధాతువు లన్నియు నేకత్వ మొంది వచ్చినా నని యర్థ మర్థావబోధ మగుచుండు నని గ్రహించునది.

కొన్నివిషయంబులందు ధాతువునకు ధాతు వను ప్రయుక్తంబగు. ఎల్లిపో; కొండొకచోఁ గర్తకర్మములు లేకున్నను గ్రియలు మాత్రమే, క్రియలు లేకున్నను గర్తలు మాత్రమే, కర్తలు లేకున్నను గర్మము మాత్రము తప్పదు.

క్రియలు సకర్మకాకర్మకాది నానాభేదంబుల నొప్పారు. అన్నియు వ్యతిరేకక్రియలకుం బోలి యుండు; సర్వక్రియలు స్వార్థతుల్యంబులు; భూత ముప్రధానము. కర్తృసప్తక్రియలకు భవిష్యత్తు ప్రధానము; కర్మసప్తమునకు వర్తమానకవులు ముఖ్యులు. మఱి పురుషములు, వచసములు మొదలగునవి యిప్పటిభావకవుల మహాగ్రంథములనుండి సిద్ధము లని గ్రహించునది.

సామాన్యముగాఁ బ్రతిక్రియకును, స్తాడు, తాడు, చ్చేడు, చ్చేని, టాడు, టుడు, టడు, ఛాడు, అండి, ఏసి, అష, లోనగునవి ప్రథమైకవచనమం దగుచుండును. వస్తాడు, వత్తాడు, వచ్చేడు, వచ్చేని, తింటాడు, తించాడు, తింటుడు, తింటడు, వొచ్చినోడండి, వెళ్ళేసె, పోయాష్ష, లోనగునవి. తక్కినరూపంబులు క్రియాముఖంబునం జూచుకొనునది. ధాత్వంతంబున నాడునడులుం జూపట్టెడి. వొచ్చినాడు, వచ్చినడు, వచ్చిండు, మొ॥ ఇచ్చు ధాతువు వ్యతిరేకవిధిప్రార్థనాదియ కారమునకు వకారంబు సిద్ధంబు. ఇవ్వక, ఇవ్వు, ఇవ్వను, ఇవ్వుడు ఇవ్వవలెను. శేషము వచ్చుధాతువునకుం బోలె గ్రాహ్యంబు. వచ్చాడు. మొ॥

కొట్టుధాతువు—కొడతాడు, కొడ్తాడు, కొడుతుడు, కొడ్తడు, కొడుతున్నాడు, కొడ్తూవున్నాడు, కొడుతూన్నాడు, కొడుసున్నాడు, కొడుచూవున్నాను, కొడుచూవున్నాడు, కొట్టాడు, కొట్టేడు, కొడుసుంది, కొడుచుంది, కొట్టుచుంది, కొడితివి, కొట్టావు, కొట్టింది, కొడదాము, కొడదారి, కొడ్తాము, కొడ్ఛాము, కొట్టుఛాము, కొడచాము, కొడుసాను, కొడ్దాము, కొట్టుతును, కొట్టుతది, కొట్టుతుడు, కొట్టేసె, కొట్టేటి; కొట్టబడేసె, కొట్టమడు, మొ॥ ఇట్లే వెళ్ళుప్రభృతులును జూచుకొనునది. వెళ్ళున కెళ్ళు రూపాంతరము—ఎల్తాడు, ఎలతాడు ఎల్తడు, ఎల్తది, ఎల్లిండు.

తినుధాతువు—తింటాడు, తింటుండు, తింఛుంది, తింటది, తినేసింది, తింది, తింటావు, తింటవు, తిన్నావు, తింటువు, మొ॥

అనుధాతువు—అంటాడు, అంటాను, అంటది, అంటుంది, అంఛాను, అంఛది, అంటున్నాడు, అంటును, అనేను, అనేవు, అనీని, అనండి, అందాము, అంటుక్, అనకేసి, శేషము సుగమము; ఇట్లే వినుకుంటును, తినుకుంటును, లోనగునవియును;

చేయుధాతువు—చేస్తాను, చేస్తాడు, చేస్తడు, చేస్తుడు, చేస్తది, చేస్తుంది, చేస్తూవున్నాడు, చేస్తున్నాడు, చేసేడు, చేసిండు, చేసెడు, చేశీని, చేశేని, చేస్తిరి చేసుతాము, చేసుదాము, చేతాము, చేద్దాము, చెయ్యండి, చేద్దూ, ఈచేకి సేయు నగు—సేదాము, సేతాము, సేద్దాము, సేనుండి, సేసేడు, కొన్నిమెడల నాద్యశేషంబు నగు—సేకండి, చేకండి, సేచేను ఇత్యాదులు ప్రయోగంబుల నెఱుంగునది.

పడుధాతువుపై లేదుశబ్దం బనుప్రయుక్తంబైన డులోపంబును ద్విత్వళకారంబు నగు—పళ్ళేదు.

దీవించుధాతువు వకారంబునకు యకారంబును, ఇంచుగ్లోపంబు వైకల్పికంబుగను నగు—దీయిస్తాడు, దీయిస్తిని, దీయించుతాడు, దీంచుతాడును; అఱచు ప్రభృతు లుకారమధ్యంబు లగు—అఱుచు, కఱుచు, మఱుచు, మొ॥

ఇచ్చాద్యాదులకు వకారాదేశంబు వైకల్పికంబు—యివ్వు, యియ్యి, యివ్వను, యివ్వక, యివ్వకండి, ఇవ్వండి, ఇవ్వదు. వికల్పంబున యియ్యి.

వచ్చుధాతువు—వచ్చుతాడు, వచ్చినడు, వచ్చిండ్రు, వచ్చేరు, వచ్చేనవ.

చచ్చుధాతువు—చచ్చుతాడు, చస్తాడు. సచ్చాఁడు, సస్తది, సస్తాద, ఈసాకు పాయును బహుళంబుగ నగు—షచ్చింది, షచ్చుకొంటది. ఇత్యాదులు;

చూచుధాతువు—చూచాను, చూశినాను, ఛూశాను, చూచా; చుశా; మరిగత్తే, గంబోలు, నచ్చిగాని, మొదలగునవి ప్రతిధాతువునకుఁ బ్రతిశబ్దమునకు నాది నగు చుండు;

అవుధాతువు—అవుతుంది, అవుచుంది, అయింది, అవుతది, అవుతాది, అవుదారి, పోదారి, తిండారి, ద్విద్వయంబునగు—ఔద్ది, అవుద్ది, అదివాడికేమాద్ది;

ఉండుధాతువు—ఉంటున్నాడు, ఉంటాఁడు. వుండేని, వుంచున్నాడు, ఉందాము, వుందారి, వుండేడు, వుండాడు, ఉండేని, వుంతాను, వుంతాము. ఉంచ్ఛాము, ఉంటూ, ఉంటడు, ఉన్నడు, ఉండును మొ.

పోవుధాతువు—పోతాము, పోఛాము, పోతను, పోతాను, పోతారు, పోతరు, పోతున్నాం, పోవుతున్నాం, పొయ్యే, పోతువున్నాం;

పూఁచుధాతువు—భూతార్థకమున శాయి యగు—పూశాయి కలవలు. కొన్నింటిచువర్ణంబునకు సువర్ణం బగు—రాచు, రాసు; పోఁచు, పోసు—మొ.

ఇత్యాదులు గ్రామ్యాచార్యులప్రయోగంబులనుండి గ్రాహ్యంబులై భావకవిత్వాదులకును, ఎంక్యాదిగానప్రబంధంబులకును, మఱికొన్నియుద్గ్రంథములకును, ప్రమాణలక్షణంబులై గ్రామ్యంబున విరాజిల్లుచున్నయవి.

తే. కుండలో వోటి మెతుకట్టి కూడు బాగ, వుడికి వుందని తెల్సుకునేటిమల్లె
గేమ్మ్యవేకరనం గిష్ట సేసినాను, మిగిలివున్న దెల్చుకోండి పొస్తకాల.

## విగ్నాపనం.

అయ్యల్లారా,

నానిష్టు వేకరనం రాశాను. ఇంద్లో వెన్నో యిసయాలు విశిసిమెట్టి వుంటాను. మీ రయి అన్నీ విప్పటిమగాకాలు రాసి పరకటిస్తూవున్న గందాలు సదిమి, వాట్లో వుండే పరయోగాలు మట్టి తెలుచుకుని, మరిన్ని మెంకిపాటలు, వెల్లిపాటలు సూసి సదిమి వందులో వుండే సిత్తరవిసిత్తరపరయోగాలు గెయించి, విదిగాకా, బావకయిత్తాల్లోని బావాలు గరయించుకోని నాయీయిగ్గినాపనల్లో వుండేమదాలు ముచ్చుకోని సదుకుకోని సుతారోళ్ళు రాళ్ళల్లో సెక్కినసాసనాల్లో వుండేమాటలు ముచ్చుకోని పాతతాటేకుమొత్తకాల్లో రాశి వున్నషువాంటి "మెక్కయ్యా, పెంక్కుటివిల్లు మొదలైనపరయోగాలు బగూమంచివ్వి యని వాటినిం బుచ్చుకోని గెట్లా సెప్పితే కయిత్తం మాగుమడతదో గట్లా గంధాలు రాసి లోకాన్ని వుద్దరించండి. ఇప్పుడూ, మీదా, కిందా మీరే దేసదేసాల్లో పేరు మొందుతారు. మీమొత్తకాలు నేరుగా సరకారుకు మోయి ఆరు ఆట్లిని వాదరిత్తారు. గుంటలు ఆటిని సదిమి గొప్పోరై లోకాన్ని వుద్దరిస్తారు. అని నా ననుకుంటును. నాను సెప్పేది సత్తియంకాని మరోటి కాదు. గాందికబాసంట! బారతాలష రామూాండాలంట్ట, పాడుబాస తెచ్చిపెట్టి మన్ని సంపుతుండారు. అంధరికీ తెలిచేబాసైతే దేసం వొక్కయిదమై మోయి బాస చులబమై షుసకబాసక్రింద అంధటూ మాంకి మోతది. అప్పుడే దేషం మాగుమడతది. ఈహాలోన సేచేమూనుబాగులు కొంధ రీడ నాడ నుయులుదేరి దీన్ని వుద్దరించి మనికి మరమోపకారం సేస్తుండారు. ఆరికి మన మాంధా కురతగ్గులమై వుండాలి. ఆరిమూదం మట్టుకోని సేయించాల. ఆర్ని తీసుకొచ్చి పది మంది కూకుకొని కూకుడోని లెగిచే ర్లిచ్చి గౌరవించాల. ఆరే మనకీవుపకోరం సేసినార్లో మొదటోరు. మీరుభాగా వాలుసించుకోండి. బాస మాగుమడేకాలం వొచ్చింది, వస్తూంది, మీరు భాగా నేసుసుకోని యంధరికీ తెలిసి మొయ్యేలాగ మెంకిపాటలు మెల్లిపాటలు రాసి మీమీబావాలు దేసానికి వెళ్ళపెట్టి మీజలపూాలు సారదకం సేసుకొంటూ రనిన్నీ విట్లు యిన్నయిస్తూ వింతటితో వూపకుంటున్నాను.

---

రక్తాక్షి కార్తికమున వెలువడినప్రబుద్ధాంధ్రపత్రికలోఁ జింతాదీక్షితులుగారుసాహితీసమితి యనువారు “తెలుగుశాస్త్రుల్లుగారు” అనుపేరున వ్రాసి ప్రకటించినవ్యాసమును సమగ్రముగాఁ జదివితిని. అట్టివ్యాసములానందదాయకములే గాని దానియందు నాకుఁ గొన్నియసందర్భములవలెఁ బొడకట్టి వాని కెట్టిసమాధానము లుండునో యని యి ట్లుద్యమించితి.

వ్యాసమంతయు గ్రామ్యపదములతో నిండి యున్నది. అందు శాస్త్రుల్లు అనుపాత్ర మొకటి కలదు. ఆశాస్త్రి కొడుకు నాన్నా మరీ, అనినంత శాస్త్రి- “ఎన్నిమాఱులు నీకుం జెప్పవలయును నాన్నా, యనఁగూడదు. ‘నాయనా, యన వలయును. మఱియు మరీ, యన రాదు. మఱియు నన వలయును. తెలిసినదా” అని పలుకును. మఱియు—“పరిశుద్ధమైనభాషనే మాటలాడఁ దగు, క కు దీర్ఘ మిచ్చిన కా, కకు గుడి యిచ్చిన కి, మీ మ్యాష్టరునకుఁ దెలుఁగు రాదు, ఉచ్చరింపకు ముచ్చరింపకుము, మాటలాడెద వెందునకు, వర్ధింపుము లెమ్ము, నీనేత్రంబులు శిరంబుపై కరుదెంచినవి, కించిత్స్నానము న్గొని తెమ్ము, పప్పున లవణం బతిమాత్రముగ నున్నది” ఇట్లు కొంతవఱకు గ్రాంథికభాషతో మాటలాడించి యంతలో నాపాత్రముచేతనే గ్రామ్యము మాటలాడించి నారు. ఇది యేమిపాత్రవివేకమో యని పరిశీలింపఁగా భార్యతోఁ గోపముతో మాటలాడునప్పు డట్లు పూర్వాభ్యస్తమైనవ్యావహారికగ్రామ్యభాష వచ్చె నేమో యనుకొంటిని. కోపము లేక శాంతుఁడై యున్నసందర్భమందును వ్యాసకర్త తనయభ్యాసమును బురస్కరించుకొని యేమో గ్రామ్యమే వ్రాసినాఁడు. ఇది దృశ్యకావ్యము కాదు. శ్రవ్యమే. శాస్త్రిగారికిఁ గోపము వచ్చినను వ్యాసకర్తకుఁ గోపము రాలేదు. ఆయాసందర్భములు చిత్తగింపుఁడు—“కోపం కోపం అంటావు, చూడు ఏం చేస్తానో!, అదుపాజ్ఞలు లేకుండా సంచరిస్తున్నావు, ఈవాళనే నయింది. రేపొద్దున్న ఇల్లా చేసీదాన వేనా! ఒళ్ళూ పయీ తెలిసి సంచరిస్తే, మీకుతూందే, (ఇంతవఱకుఁ గోపముచే మితి మీఱెనందు రేమో!) శాంతించి—మజ్జిగ పోయుము, కొనుము పుత్రికా, అని యంతలోనే—రాశార్రా అందరూ వ్యాసాలు, యిలా రా, ఏమిట్రా, చెప్తా విన్నార్రా, మళ్ళీ రాసి చూపించు, చూద్దాం, ఇత్యాదులు. ఇది యెట్టి నియమమో?

ఇట్లు వ్రాయుట కేమికారణమో? తెలియదు. ఇది యొరుల నెక్కిరింపం బోయి యేదేమో చేసిన ట్లున్నది.

గ్రామ్యము తెలుఁగుభాషలో నొకవిధ మని యందఱకుం దెలిసిన విషయమే. గ్రాంథికవాదు లైనను, తమతమ గ్రంథములలో నింద్య గ్రామ్యము వాడఁ గూడ దనియు వ్యవహారమున వాడవచ్చు ననియు జెప్పుచున్నారు. కాని యీవ్యాసకర్త చెప్పినట్లు, ఓనమాలలోఁ గూడ గ్రాంథిక భాషనే యుపయోగింప వలయు నని చెప్పియుండ లేదు. ఇట్లున్న దానిలో నీపరిహాసకుఁడు—"నాన్నా" అన కూడదు. 'నాయనా' అన వలయును. అని వ్రాసెను. అక్షరములు నేర్చుకొను కాలములో నజ్ఞుఁ డగుబాలునికి—క- కకు దీర్ఘ మిచ్చిన కా; అని చెప్పుదురా! కాకు దీర్ఘ మిచ్చిన నన రాదా? "ఛామధ్యమధ్యా, ఊకును, కఖగఘఙ్" ఇత్యాదులు. వీరు వ్రాసినట్లు "కకు దీర్ఘ మిచ్చినఁ గా" యన నక్కఱ లేదు. ఇట్లు స్వభావమును గాదు. పిల్లవాఁడు నెయ్యి, అన "ఘృతము ఘృతము" అన వలయు నను మూర్ఖుం డుండఁడు. ఈవ్యాసములో "శాస్త్రిలు" అనుపేర్లు గలవారిద్దఱు లాగునఁ జూపట్టుచున్నారు. కాని వ్యాసకర్త యొక్కఁడు గానే చెప్పెను గాని యిద్ద ఱని యెందును సూచింప లేదు. మొదట గ్రాంథికముగా మాటలాడి "పాఠశాలలందుఁ దెలుఁగు భాష యీరీతిని ధ్వంసముచేయుచున్నారు" అని చెప్పినవాఁడు స్కూలులోఁ గునికిపాట్లం బడుచు బిల్లలచే వ్యాసములు వ్రాయించెను. "వ్యాసం రాయ మంటే గ్రామ్యం తగలేస్తారు రా!" అనెను. స్కూళ్ళలో వ్యాకరణము, భాషయు లేనప్పుడు గ్రామ్యమునకే గౌరవ మిచ్చినప్పుడు తెలుఁగుభాష ధ్వంసము చేయుచున్నా రనుటలో దోష మేమి! భాషాజ్ఞానము లేనియాశుంఠలు గ్రామ్యమునే గాక గ్రాంథిక మెట్లు వ్రాయఁగలరు? హెడ్మాస్టరు తనకునికిపాట్లు చూచెనేమోయని భయపడువాఁడును, జీతమున కొఱడ లమ్ముకొనినవాఁడును అగుటా నధికారులమత మనుసరించి యుండవలెను గాని "గ్రామ్యం తగలేస్తారు రా!" అనుట విరుద్ధము. ఇట్టివిరుద్ధధర్మమును, అట్టిశాస్త్రి పలుకుట సంభవింపదు. వీ రిట్లు వ్రాయుట తోఁచినట్లు గ్రాంథికవాదులను దిరస్కరించుటకు వ్రాయుటయే కాని స్వభావము కా దని నిశ్చయింప నగు.

ఆంధ్రనాటకరంగము:—అనునీవిమర్శనగ్రంథమును చిత్తూరు రాజకీయోన్నతపాఠశాలాప్రధానాంధ్రోపాధ్యాయులు నుభయభాషాప్రవీణులు నగు బ్ర॥ శ్రీ॥ గొల్లపూడి శ్రీరామశాస్త్రి గారు రచించి శ్రీవిద్యావినోదినీ గ్రంథమాలాప్రథమగుచ్ఛముగం జేసి ప్రకటించి నా కొకప్రతి ననుగ్రహించినారు. తీరిక లేనివాఁడ నైనను నేనాగ్రంథ మామూలాగ్రముగఁ బఠించి వారివిద్యావైశద్యమునకును విమర్శకతానైపుణ్యమునకు నెంతయో సంతసించితిని. శాస్త్రి గారిని నేను వినుకలిం గాని కనుగలిం దెలియనివాఁడ నైనను గ్రంథశైలిం బట్టి వారు చిత్తూరివారు గా రనియుఁ బ్రొద్దశజు లేమో యనియు నూహించితిని. ఇందు శాస్త్రిగా రుదాహరించిన గ్రంథములంబట్టి వారు గొప్పపండితు లని నిర్ణయించితిని. నాటకరంగమున కుండవలసినసర్వవిషయములును గ్రోడీకరించుటం జేసి తదనుభవమును వారికిఁ జక్కగాఁ గల దని తెలియుచున్నది. నాటకకర్తలకును, రంగస్థలంబులకుం గావలసినసర్వవిషయములుం జర్చించుచు వ్రాసినతద్విమర్శనమందు—నాటకాభినయములు, పాత్రౌచిత్యము, వస్త్రాచిత్యము, రంగపరికరములు, పాత్రోచితభాష, సంగీతము, నాటకపద్యములు, పద్యపఠనము, గీతములు, నటులు, లక్షణములు, రసములు, లోనగువిషయములు శాస్త్రానుభవము లోకానుభవముం బురస్కరించుకొని వ్రాసియున్నారు.

అందు వాచికాభినయమున నటుఁడు పద్యము గాని గద్యము గాని చదువునప్పుడు నడపుపద్ధతిం జెప్పుచు "నటవిటగాయకగణికా" అను పద్య మొంతో సమయోచితముగా నుదాహరించిరి. చదువురానిమూఢులు నటకు లైనచో నిట్లుండక మఱి యెట్లుండును? ఇప్పటినటకులలో నేకొలఁదిమందియో తక్కఁ దక్కినవా రందఱు నిట్టివారే. మాటలే తెలియనివారు పద్యార్థము చేసికొనుటయు నుచితరీతి నభినయించుటయు నభఃపుష్పమే కదా! "రంగమున సంగీత మొక్కటియే ప్రధాన మనుభావమును నటులు మానువఱకు కాదోషములును మాన" వని చెప్పనగు. ఈవాక్య మనర్ఘము. సంగీత మేమో తెలియక హాహాహూహూలే సంగీత మని కూనిరాగాలకు మొదలుపెట్టి పెక్కుమందినటులు నాటకములం బాడుచేయుచున్నమాట సత్యదూరము కాదు. సంగీతము విస్తరించి లేకున్నను జక్కఁగా నభినయించుచు నర్థావబోధముగాఁ జదివినను రసభంగము కాఁజాలదు.

"పాత్రోచిత వేషములగుఱించి శ్రద్ధ వహించుట లేదు." పిడుగునకును
బియ్యమునకు నొకటేమంత్ర మనునట్లు వేషములు వేయుచున్నా రనుట
సర్వజనానుభవైక వేద్యమే. దేశకాలపాత్రము లెఱింగినవారే వేషపోషణ
మును జేయుదురుగాని శాస్త్రిగారు చెప్పినట్లు మన వెఱ్ఱివెంకయ్య లేమిచే
యుదురు? శవాలంకారములఁ జూచియైన సహింప వచ్చును గాని నటకుల
యనుచితాలంకారములఁ జూచి సహించుట లోకజ్ఞునకుఁ గష్టతరముగా నుం
డక మానదు. వారు దీనింగూర్చి విస్తరించి వ్రాసియున్నారు. సహం
జసముగా నున్నదనుటకు—"చూడాచుంబిత" అనువారియుదాహరణమే
ప్రమాణము.

"నాటకగౌరవము ధనాగమమును బట్టియే" అనుశీర్షికక్రింద వ్రాసి
నవ్రాఁతలు నామది కెంతేనానందమును గలిగించినవి. ఇక్కాలమున
భ్రష్టుఘోరము చదువుకుట్టినవాఁడును నాటకము వ్రాయుటకు మొదలుపెట్టు
చున్నాఁడు. అది మననాటకులు ప్రదర్శించుచున్నారు. ఔచిత్య ముభ
యత్ర పూజ్యము. మనపూర్వులు "నాటకాంతం కవిత్వం" అని చెప్పిరి.
అనేకశాస్త్రానుభవమును, లోకానుభవమును, రంగస్థలానుభవమును గలిగిన
పిమ్మటనే నాటకము వ్రాయవలయును. అప్పుడే అది నాటక మగును.
కానిచో నది నాకట మనుట కింతయు వెనుదీయ నక్కఱలేదు. ఇట్టిగ్రం
థములు వెలువడుచుండుటచేతనే "కుకవినందడిఁ బాసె రసజ్ఞులకుం గవితా
విశేషముల్" అని సంకుసాలనరసింహకవి వాకొనియున్నాఁడు. దుము
వు లురానివాఁడు దినమున కొకనాటకము వ్రాసి 10రూపాయలకు గ్రంథ
స్వాతంత్ర్య మొరుల కమ్ముకొనుచుంట నే నెఱుంగుదును. ఇప్పటిలోకమో
యెల్లిపాటలు నెంకిపాటలు నాదరించునట్టి దైనది. ఇది కాలమహాత్త్వము.
దానికై చింతించినఫలము లేదు. అంతకును ధనమే ప్రధాన మైనదనుట
సత్యము. ఈలోకమునకుఁ బండితకవులరూపకములు పనికివచ్చుట లే దను
టలో నాశ్చర్యము లవమును లేదు. ప్రదర్శనములు సభ్యులకుతూహలమున
కగున ట్లుండవలె ననుట సత్యమే కాని పిచ్చికూఁతలచేఁ గుతూహలపడఁ
జేయుట తగునో పరమోత్తమరచనాచాతుర్యముచేఁ గుతూహలపడఁ జేయుట
తగునో విమర్శించుకొనఁ గలిగినవారికిఁ దెలియకపోదు. చెంచునాట
ము లక్షలకొలఁది యమ్మఁబడినది. గయోపాఖ్యానము వేలకొలఁది

ఛల్లినది. . లోడారిబుచ్చిగాడు ప్రహసనము వేలైనది. ధనము ప్రధానముచేసికొనినవారు యుక్తాయుక్తవివేకశూన్యు లనుటలో దోషము లేదు. "ఇక్కాలమున మూలమూలలనుండి వెలువడునాటకములు భాషాదోషకు విశాంజనకము లగుకణుతులవంటి వని మాత్రము చెప్పసాహసించుచున్నాను." అని వ్రాసిరి ఇదిసాహసోక్తి కాదు. సత్యోక్తియే. ఇందుశాస్త్రిగారియపరాధ మేదియును లేదు. ఈవిషయమున వారు పేర్కొనినవిద్వత్కవులు నవిద్వత్కవులు నొక్కలాగుననే యున్నారు. ప్రతినాటకమందును దశరూపకాదినిరూపితనాటకలక్షణము మృగ్యము. శాస్త్రిగారు సర్వవిషయములు నెత్తికొని దీనివిషయమై యించుకమాత్రమైన వ్రాయమి కేమికతమో తెలియదు. ప్రతినాటకమందును సందర్భము లేకపోయినను "ఐకమత్యము లేకుంటే దేశము బాగుపడదు. స్పర్శదోష ముంటే దేశము బాగుపడదు. దాస్యవృత్తి యుంటే దేశము బాగుపడదు. ఇదుంటే బాగుపడదు. అదుంటే బాగుపడదు." అందురు. ఇత్యాదులేరసమును బోషించునవియై భూషణము లగుచున్నవి. ఔచిత్యము సున్న. రసము పూర్ణానుస్వారము. పాత్రపోషణము హుళక్కి. అట్టివి నాటకము లని కూడ నే ననను. అవి ప్రహసనము లనుటకేని వలనుపడదు. ఆలక్షణములు నం దుండవు. నాటకపితామహులు చేసినవిగాని ప్రపితామహులు చేసినవిగాని యిట్లే యున్నవి. ఇంక నాంధ్రీకృతనాటకము లన్ననో యవియు నిట్లే యున్నవి. వీరి తెలుఁగు వాని నట్లు మార్చివైచినది. విక్రమోర్వశీయ నాటకములోఁ గాళిదాసుఁ డూర్వశిని గౌరవించి "ఊరూద్భవా నరసఖస్య మునే స్సురస్త్రీ" అని కథానాయకాపాత్రమును బోషించెను. దాని కాంధ్రీకరణమందు నాయకాప్రఖ్యాతత్వమును బోఁగొట్టుచు "నారాయణోరుసంభవ వారాంగన" అని కాళిదాసనమర్థనమును గంగలోఁ గలిపినాఁడు. తెలుఁగుకవి. ఇట్లే తక్కినయాంధ్రీకరణము లున్నవి. కావున శాస్త్రిగారిసాహసాపరాధముల కిటఁ జోటు లే దనియే చెప్పుచున్నాను.

ఇప్పటికవులు శాస్త్రిగారు చెప్పినట్లు షడక్షరీమంత్రోపాసకులే. వీరివి తుచ్ఛమంత్రములు. కావుననే సద్యఃఫలదము లగుచున్నవి. ఈకాలపు నాటకములు కిల్లుసాములవంటి వని కొంత భాషించినారు. నే నట్లనను. అవి చికిలింతసాములు. (పల్లెలలోనిపిల్లకాయలు చికిలింతవెన్నెలను రాగిడీ,

చంద్రవంక, మొగలిరేకు, మొదలైననగలవలెం జేసి ధరించి యాటలాడుదురు.) అంతమాత్రగౌరవ మిచ్చుటకే తగి యున్నవి. మహాకవులు రచించినరూపకములు తత్తద్దేశకాలపాత్రములు గన్నులకుం గట్టినట్లు చూపి దేశము నుద్ధరించుటకు సమర్థములు. అట్టినాటకరచన కిపు డెట్టిగతి పట్టిన దని విద్వాంసుఁడైనవాఁడు విచారింపక మానఁడు. శాస్త్రిగారొక్క కుశలవ వేషము లౌచిత్యరహితములని చెప్పుచున్నారు. నేను సర్వమునకు సున్న చుట్టియున్నవాఁడను. లవకుశనాటకకర్తలు పండితకవు లని చెప్పుచున్నారు. "నిరంకుశాః కవయః" అను న్యాయంబున వారు నిరంకుశులు గనుక పేరులే కాదు. భూమ్యాకాశముల నైనఁ దలక్రిందు చేయఁగల రని నమ్ముచున్నాను. వారినాటకనామ మెట్లున్నదో రచనయు నట్లుండు ననుట స్వభావోక్తియే. కనుకనే కుశలవాదులనోటినుండి యయుక్తప్రలాపములు పలికించినారు. నేను నా బాల్యమున వీధినాటకములు చూచుచుండువాఁడ. అందుఁ బ్రహ్లాదనాటకములోఁ జండమార్కుల వేషము వేసినవాఁడు రంగమునఁ బ్రవేశించుచుఁ దానే "చండమార్కు లరుగుదెంచిరి. మహారాజు కడకు "చం" అని పాడుచు భూమి దద్దరిల్లి దుమ్మురేఁగి ప్రేక్షకులకన్నులలో గోడలు పెట్టునట్లు చేయుట నేను గన్నులారఁ జూచి యున్నాఁడను. తరువాత నీనాటకములు బయలుదేఱినవి. కొండొకకాలములోఁ గేవల వచననాటకములు వెలువడినవి. పద్యములు లేకున్న నాప్రదర్శనము లెంతో సంతోషమును గూర్చునట్టివై యుండునవి. పిమ్మట నాటకపితామహులుఁడుగారు తమవిచిత్రనళీయములోఁ బాటలకచేరిక్రమును దెచ్చిపెట్టినారు. ఈదరిద్రమే ముదిరి యీనాఁటికి పారసీకహాలుగాది "వర్ణమెట్లు" మీఁద సాంగ్సులై వర్ధిల్లి రసాభాసము లగుచున్నవి. మనపితామహుఁడుగారికి నాటకానుభవము లే దన్నచో బ్రతుకఁ జాలము. కాని వారి చిత్రనళీయములో బాహుకునికిం బెట్టినపద్యములప్రోఁగులు, అందలియనౌచిత్యము లగుపాటలు లోనగునవి నావాదమునకు బలము నిచ్చుచునేయున్నవి. ఇది గాక దాసీవాండ్రు కాసావాండ్రు, నటకులైనప్పుడు వారివారికులోచితాచారములకే యలవడి యుందురుగాని తత్తత్పాత్రపోషణముం జేయునాచారములు కలవడియుండఁ జాల రని ముమ్మాటికిం జెప్పవచ్చును. ప్రకృతనటకులలో నెవరోకొందఱుమాత్రమే సమర్థులు కానఁబడుచున్నారు. నాటకరంగములు వేనవేలు బయలుదేఱినవి.

శాస్త్రిగారు రీతివృత్తములమాటం దలపెట్టినారు. అది యెందుం గూడి
యుండెనో తెలియుట దుస్సాధము. పాత్రపోషణము లేకున్నను, పాత్రి
మున్నదిగావున దాని కంతం జింతింప వలసినది లేదు. వేషము తా వాత్స్యా
జనక మని శాస్త్రిగారు రెంకో వ్రాసి యొకకిరాతుని కథ వ్రాసియున్నారు.
అది మిక్కిలి చక్కంగా సంవిధానమును బోధించుచున్నది. అట్లయినప్పు
డే నాటకప్రయోగము శ్లాఘాపాత్ర మగును. ఇప్పటినాటకములయు నటకు
లయు స్థితిగతు లిట్లున్నప్పుడు సాత్త్వికాద్యభినయములమాటం దడవి సాత్త్వి
కము— స్తంభప్రళయాద్యష్టవిధంబు లని వాకుృచ్చినారు. ఇవి యిప్పుడు
మన దేశమునకే దూరదూర మైన వని చెప్పుటకు వెనుదీయ నక్కఱ లేదు.
ఇంక నాట్యమో నటరాజుం జేరియున్నది. భరతమునియు భరతాచార్యుల
సామ్మె. దానివిషయమై విచారము మన కక్కఱయే లేదు. శ్రేష్ఠ మగు
నొకయాలేఖ్యముం గొని యందలి భావాదులం గ్రహించి నటకుండు ప్రవ
ర్తింపవలయు ననియు నవి వారికి సహాయకారు లనియుం జెప్పి శారదలో
నగుమాసపత్రికలలోని భావప్రకటనపటములు కొంతవఱ కుపకారజనకములే
యగు ననిరి. రవివర్మకులచిత్రపటము లుపకరించు ననిన నన వచ్చును
గాని శారదాదులం జెప్ప నొప్పునా? శారదాపత్రికపైం గలసరస్వతికిం
గలపాలిండ్లు పెద్దవియై గాన వచ్చి భావప్రకటనముం జేయుచున్నవి. కనుక
నా? ఇందు శాస్త్రిగారికి నేను వ్యతిరేకుండను. అందుం గలశారదంజూచిన
మహాపాతకము రాక మాన దని నాయభిప్రాయము.

రసములం గూర్చి శాస్త్రిగారు కొంత చర్చించిరి. ఇప్పటినటకుల
కుగ్గుంబాలతోం బెరిగినది నీరసము. రసప్రకటనము సుసాధ్య మని నే నన
సాహసింపను. మనకవులగ్రంథములే యిందు నాభాసము లగుచున్నవి. ఈన
టకులా రసములం బ్రకటించువారు? కావునం దద్విచారము నిరవసర మని
నేం దలంచెదను. మఱియు నాటకపాత్రోచితభాషం గూర్చి విపులముగాం
జర్చించినారు. దృశ్యకావ్యములలోం బాత్రోచితభాష యుండిననే కాని
నాటకము రసాభాస మగు నని సిద్ధాంతీకరించినారు. ఇది నాకును సమ్మ
తమే. నేను నాటకములందుం గొంతవఱకుం బాత్రోచితభాష నుపయోగిం
చియే యున్నాండను. కాని యట్టిభాష నుచితరీతిని వ్రాయుట దుర్లభ
మని నాయభిప్రాయము. వేదము వేంకటరాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీ

యములోనిగ్రామ్యభాష పాత్రోచితకుఁ గొంతదూరమై యున్నది యని చెప్పుచున్నాను. ప్రతాపరుద్రీయమందలి సుల్తాన్ మాటలలో—చేసినాఁడు, మెరుగు పెట్టినాఁడు, ఇదేమివర్తకులు, మధ్యాహ్నన్, షూద్యడూ, మాకంటిచూపు చేస్తుంది, వజ్రి, ఇత్యాదులు అపభ్రంశమైనతురకమునకు భిన్నములు. అట్టిభాష వ్రాయుటకు లోకజ్ఞానము చక్కఁగాఁ గలిగియుండవలయును. నాటకములో నొకచతురీ వేషము వేసికొని వచ్చి స్వచ్ఛమైనవైదికభాషతోఁ బ్రసంగించిన రసాభాసము గాక యేమగును? వేంకటరాయశాస్త్రిగారు తమనాటకములోఁ దురకవానిచేత గ్రామ్యపద్యములు చదివించినందులకు లోకము గర్హించుచునే యున్నది. రంగారాయకరనసమాచారములోఁ గాళ్ళకూరి సాంబశివరావుగారు హైదరుజంగుచే శుద్ధములైనపద్యములు చదివించినారు. కవు లిట్లు నాటకములం బాడుచేయుచుండఁగా ననభ్యాస్యులైననటకుల ననం బనియుండునా? వీ రిట్లు పాడుచేయుచుండ వారు వీరికి నూఱురెట్లుగాఁ బాడుచేయుటలో నాశ్చర్యమేమి యుండును?

ఈసందర్భమున శాస్త్రిగారు నాటకరంగమున కంత యవసరము గాకున్నను సంగీతమును గూర్చి యెంతయో వ్రాసినారు. అది నాకు మిక్కిలియానందము గలిగించినది. సంగీతవిద్వాంసుల కది మిక్కిలి యుపయోగము. “గీతిగానేన యోగ స్స్యాత్” అనుసూతసంహితావచనము నామాట కూఁతగట్టియగుచున్నది. నాటకపద్యపఠనముం గూర్చి వ్రాసినదానితో నే నేకీభవించుచున్నాను. ఉచితస్థలములలోఁ గొంచెము గానే పద్యము లుండనొప్పు. పాటలవిషయమై శాస్త్రిగారు తుదకుఁ జక్కఁగానే వారియభిప్రాయమును వ్యక్తీకరించినారు. ఒకవిధముగా గీతము లుండవచ్చునను దానికి మాత్రము నేను వ్యతిరేకిని. సంగీత మాపాదమధుర మనుట నిశ్చయమే కాని ఆసంగీత మీసంగీతము కాదు. శాస్త్రయుక్తమైనచో దాని కొంప్రభావ మున్నదియే కాని నాటకములో సాయనం దెలియనివారు ఏవెఱ్ఱివెంకయ్య చేసినబూఁతుపదములో చదివి గాయకుల మని పేరుపెట్టుకొని పాడవచ్చిన నది మధుర మగునో విష మగునో లోకమే గ్రహించుఁగాక. నాకు నాటకములోనిపాటలు పాడుట తప్పనియు రసభంగకర మనియు నభిప్రాయము. కృష్ణమాచార్యులుగారు రూపకములలోఁ

పాటలు చేర్చుటను దప్పుచేసి దానిం దిద్దుకొనుటకుఁ జెప్పిన సమాధానము. "పట్టపగలు కన్నము త్రవ్వుచున్నావేమిరా యన నాకడుపుకక్కుఱితి నీ వెఱుఁగవా" అన్నట్లున్నది. కష్టాంతనాటకములు పనికివచ్చు నని శాస్త్రిగా రెన్నో యుదాహరణము లిచ్చియున్నారు కాని వాని కన్నింటికిని వ్యతిరేకాభిప్రాయము లిచ్చుట సులభసాధ్యమే. బొబ్బిలినాటకములో మల్లమాదేవి కత్తితోఁ బొడుచుకొని చచ్చినది. దానితో నాటకసమాప్తి యైనచోఁ బ్రేక్షకులకు వేదాంతము కుదురునో వెఱ్ఱి కుదురునో లోకము నిర్ణయించుఁగాక. మఱియు నుత్తమనాటకలక్షణములు మొదలగునవి చెప్పియున్నారు. అవి మిక్కిలిసమంజసములు.

ఈవిమర్శనము నాటకకర్తలకును, నాటకులకును, సంగీతపాఠకులు లోనివారికి నెంతో యుపయోగమైనది. దీనిం జదివి యిందలి సర్వవిషయములు నభ్యాసము లగునట్లు చేసికొని యట్లు ప్రవర్తించినచో మేలు గాంతురుగాక యని కోరుచున్నాను.

"ప్రాఁ దెనుఁగుఁ గమ్మ"

ఇది గిడుగు రామమూర్తిపంతులుగారు రచించి, ఆంధ్రపరిషత్పత్రికలోఁ బ్రకటించిరి. దీనిని నేఁ గర్మవశమునఁ జూచుట తటస్థించినది. అఱసున్నలు పెట్టి వ్రాసినయీకమ్మ గ్రామ్యాచార్యులవారిది గావున గ్రామ్యమో యనుకొంటిని గాని చదువం జదువ గ్రామ్యమును బోషించుటకై గ్రాంథికమును దూషించి దూషింపఁ జేయుటకు భాషింపఁబడి యనన్యాకృష్టము లగుమాఱుమూలపదంబు లేఱి యేఱి దారియుఁ దెన్నును లేకుండ దురవగాహముగా సలక్షణగ్రాంథికభాషపై నిరసనభావ ముదయించునట్లు గీఁకఁబడిన దని తెలిసికొంటిని. గ్రాంథికభాషయం దింతకష్టమును నీరసము నున్న దని చూపుటకు వారు మిక్కిలి శ్రమపడి శబ్దరత్నాకరాదికోశములు వెదకి వెదకి యెట్లో తుద ముట్టించినారు. పాపము! వారి కీకమ్మ వ్రాయుటకుఁ గొన్నిమాసములైన పట్టియుండు నని తలంచితిని. వారీపగిది శ్రమమునకుఁ బాల్పడుటకంటె వారివారి కలవాటు పడియున్నగ్రామ్యమునకే పాటుపడి వ్యాసము వ్రాసిన నది యెంతసంతోషదాయకముగా నుండునో గ్రహింపఁ జాలక పోయిరి. ఈమృష్టరచనవలన సలక్షణమైనగ్రాంథికముపై నెవ్వరికి ననిష్టము పుట్టఁబోదు. కాని రచరపైఁ బుట్టక పోదు. ఇట్టిరచన

చేయువారే కుకవు లని వర్ణింపఁ బడుచున్నారు. "కుకవిసందడిఁ బాసి రస
జ్ఞులకుం గవితావిశేషముల్" అని కలదు గదా! నియమము నీతి లేక వారు
తోఁచిన తెలుంగున నోటికి వచ్చినట్లు కోశములు చూపినట్లు చేతితో వ్రాసి
నారు. అందుచే నిట్టిపదసమ్మేళన మొకవేళఁ జెవి కింపు గాకున్న నగుఁ
గాక. ఈపదములే సమయానుకూలముగా గ్రంథములం జొప్పించిన నెంత
యో యొప్పించు ననియే నాయభిప్రాయము. పంతులుగారి మొదటివాక్యము.
"సిరిఁ దాల్చుతేఁ డొగిఁ జిన్నిచూపులఁ జూచు తెనుఁగుఁ జదువుల
రచ్చతీర్పరులారా!" ఇది యాంధ్రభాషాభిమానులారా! యనునట్టిసం
బోధనము. ఇంతలిపదములకూర్పు సరిపడక యర్థము దురవగాహ మగు
చున్నది గాని "సిరిదాల్చుతేడు, చిన్నిచూపులు, చూచు, తెనుఁగు, చదు
వులరచ్చ, తీర్పరులారా!" ఈపదము లసహ్యము లయినవా? వారికూర్పు
సహ్యమయినదా! ఈదుష్ట మయినకూర్పుచేతనే దురవగాహమట్లు తోఁచు
చున్నది. "జదువర్ల నూర్వురఁ జాలించి మీరలు వ్రాఁబొత్తములనుడులు
వెడలవైవింప" చదువర్లు, ఇట సంశ్లేషము, చాలించి=నిలుపుదలచేసి; ఇట
విడిచి యన నొప్పెడు; కయ్యంబు చాలించి యిత్యాదిస్థలముల నీచాలించి
యొప్పెడు. వ్రాఁబొత్తములు ఈనకారాగమము వైకల్పికము సర్వస్థలము
లందు నొప్పదు గావుననే వైకల్పిక మని చెప్పియున్నాఁడు. వ్రాఁబొత్తము
లని నీరసముం బుట్టించుటకన్న, ప్రాఁబొత్తము లనరాదా? వెడలవైవింప
ఇది వేయించుటకు నచ్చినపాడు. ఇట్టికూర్పుచేత నెట్టిమంచిపదము లైన
రోఁత పుట్టునట్లు చేయవచ్చును. "కలకలలాడు చున్నవి సిలుకలు పిల్లలతోఁ
గూడి గూడులలోఁ గోడెగములు చేయుచుఁ జెట్లు గలమావితోఁపులకోనల
లో" ఈపదము లన్నియు ముద్దులు మూటగట్టునవియే కదా. పైకూర్పు,
ముద్దులు మూటగట్టుచున్నదో మొద్దులు మూటగట్టుచున్నదో చిత్తగింపుఁ
డు. ఇట్లే రామమూర్తిపంతులుగారీవ్యాస మంతయుఁ బ్రజలకుఁ బ్రాఁదెనుఁ
గుపై రోఁత పుట్టించుటకు రచియించినారు. వారు చచ్చి కుళ్ళినడొక్కలని
చెప్పిన యీతెనుఁగుపదములనే తీసికొని మనోహరముగా మఱియొకవ్యాస
ము వ్రాసి చూపుట సుకర మనియే చెప్పుచున్నాను. ఇది వారు చేయవల
యు నని చేసినదియే కాని మఱియొకటి కాదు. ఇట్టిపదములనే తీసికొని
పంతులుగారి గ్రామ్యముపయోగింపక యొకపద్యము వ్రాసి చూతము మనో
హరముగా నుండునో యెట్లుండునో విచారింతము.

"ఉ. కమ్మనిమావిపూవులను గాలువ గట్టుచు తేనె లాని జుం
జుమ్మని తేంటు వాఁడెఁ గడుఁ సొంపలరార నిగుళ్ళు మేసి కో
కొమ్మని గండుకోయిలలు గూసెను జిల్కలు గోరువంకలున్
ముమ్మర మైనపండ్లు దిని మొత్తముగా వగఁ బల్కె నత్తఱిన్."

గ్రామ్యముతో వ్రాసినపద్యమయినచో నెట్లుండునో పాఠకులే గ్రహింతురుగాక.

పంతులుగారిది ప్రాఁదెనుఁగని చెప్పుచు నఱసున్నలు, శకటరేఫములు మొదలగునవి చేర్చుచు శుద్ధాంధ్రపదములనే చేకొనక తద్భవాదులం జేకొనుట యెట్టితగవో తెలియదు. దానికే మఱియుం దెనుఁగే యనుకొందము. కాని యిందు— దేశము, దేశభాష, మాతృభాష, మాత, ఆంధ్రులు, ఆర్యులు, హూణులు, మ్లేచ్ఛులు, యవనులు, రాజులు, ప్రజలు, ప్రయోగ, పురాణము, సంధులు, ఆదేశములు, ఆగమములు, దయసేయుఁడు లోనగు సంస్కృతపదములు సొప్పించుట కేమికారణమో? ఇవి దెనుఁగుపదములా? ఈపదములకు వారికిఁ దెనుఁగుపదములు రావా? ఏల స్వీకరించినారో తెలియందగు "ఒకింత సదివితివేని, కొనియాడనియ్యసేయుదురే?, నుయ్యన్నానేఁగా? సదువన్న నేమి?" ఇత్యాదులలోని చకారములకు సకారము లెట్లు వచ్చెనో? మఱియు వారితరులగ్రంథములలో నచ్చుతప్పులు పడినను వానిఁ బట్టి పాలార్చి యిన్నిసారు లిందున్నవని గంభీరముగాఁ బెదగొంతెత్తి యఱచుచు సభలలోఁ బలుకుచుందురుగదా! అట్టివారియీవ్యాసములో "చెట్టులటు, వారియగ, దాటు, ఎన్నడు, ఇతగజదివి" ఇత్యాదులందు నర్థానుస్వారములు లేమి వారేజాలలోనైనఁ జూచియుందురా? ప్రెస్సువారినెత్తిపైఁ బడవేయుదురా? ప్రెస్సువారిపై వేయుట వీరిమతములోనిదికాదు. మఱియు నీచిన్నవ్యాసములో— "కనుఁడుయిచ్చమై, అలవఱ్చికొను, ఏమఱ్చి, నేర్త్రి (ప్రయోగమునకు) ప్రయగ, చొత్త్రెరి, తాత్త్రెరి, ఎఱ్ఱ, ఇత్యాదిరూపములకు వీ రేమిగతిగలిగింతురో విందుముగాక. మఱియు నిందు— "మన తెనుఁగు వారార్యులోటు? బలెబలె! మన తెనుఁగువా రాంధ్రులోటు? బలెబలె! ఆంధ్రులు నార్యులోటు? అయ్యరె? అని వారు వారియాశ్చర్యమును వెలిబుచ్చుచుఁ దమమహోన్నతమతమును వెళ్ళఁబెట్టినారు. చూచితిరా పంతులుగారిసాహసము! తెలుఁగువారైనవా రనార్యులలోఁ జేరినఁ జేసుదురు గాక. ఇతరాంధ్రుల నందఱ నిట్లు పలుకుట సజ్జనలక్షణమా? ఇట్లు వ్రాసి మఱి

యు విస్పష్టముగా "మానిసికోలముల నేర్పరించితిరేని మన తెనుఁగువారిఁ గోయలతోడను నెఱుకులతోడను దగఁగూర్చి మఱిచెప్పవలయును జుండీ" అని వ్రాసినారు. మనము కోయభాష, ఎఱుకలభాష, కోదుభాష, సవరభాష, నభ్యాసము చేసి పరిశుద్ధాంధ్రభాషను విడనాడినగ్రామ్యులమైనప్పుడు కోదులము గాక యెఱుకులముగాక యెట్లగుదుము? హా! హా! పాపము శమించుఁగాక పాపము శమించుఁగాక.

ఇంతియేకాదు వినుండు— "హూణులకానిండు మ్లేచ్ఛులకానిండు, నేలమ్మమగలను నేలఁబుట్టువులు దముఁ గన్నతండ్రిగాఁ దలంప వలయు" నేల+అమ్మమగలు=నేలమ్మమగలు; మ్లేచ్ఛుల నైన వారినిఁ దండ్రిలఁగాఁ దలఁపవలె నఁట! ఇందు వారి నమ్మమగలవలె నని ధ్వని కలదు. ఇట్లు వ్రాయుట సద్ధర్మము కాదని నాయభిప్రాయము. మఱియు- ప్రాబాసవ్రాయుట యేటి కెదురీఁత యఁట! గ్రాంబాస (నింద్యగ్రామ్యము) ఏటికి వాలీఁత యని వీరితలంపు కదా? ఆవాలు వాలే సంద్రముదనుకను. పంతులుగారికిఁ బ్రాసుదులే కాదు ప్రామినుకులు కూడ నహితము లయిన ట్లింకొకటి రెండు వాక్యములఁ బొందుపఱచినారు. "పినతల్లిచెవులు బీఁకపువ్వులును గావు" దీని కేమి "ఈనాటిపెద్దలనుడులను నేర్చి కతయేని కమ్మయేని గివ్వ రాకట్టె" నన్నయాదులనుడులు పనికిమాలిన వని త్రోసిపుచ్చి యీనాఁటిపెద్దలు (గ్రామ్యులగు వారే) వారిమాటలే నేర్చికొని కతగాని కమ్మగాని గివ్వవలె నంట! ఎంతఁజెప్పిన నిది యరణ్యరోదనమే యగు. వీరియట్టివా రెవ్వరో కొందఱు తక్కఁ దక్కినవా రెవ్వరును వీరిమాటలు విని చెడిపోవుటకుం బ్రయత్నింపరు.

ఇట్లు వీరు పెంచి పెద్దవ్యాసము వ్రాసిరి. ఇది యంతయుం బరిశీలించి చూడగా నెన్నిమాఱులు చెప్పినను జచ్చి కుళ్ళినడొక్కలవంటిప్రానుడులు, ప్రానుడులు, ప్రాఁదెనుఁగులు, ప్రాబాసలు, ప్రాఁబొత్తములు, ప్రాఁజదువులు, ప్రామినుకులు, ప్రాఁబేరు, ప్రాఁబలుకులు, ప్రాఁగమ్మలు, వ్రావ్రాలు, ప్రానాణెములు, ప్రాఁగొత్తలు, ప్రాతాలు, ప్రాసరకులు, ప్రామాటలు, మొదలగునవి. ఎక్కడఁ జూచినను, ప్రా ప్రా ప్రా ప్రా ప్రా అనునవియే వ్యాస మంతటను గానిపించెడిని. నన్నయ, తిక్కఁడు, వెంకన, రంగన, సూరన, వీ రందఱును బ్రాఁతమనుష్యులు. వీరినుడులే

మనకు దయ్యాలు. మనలఁ బీఁకికొని తినివేయుచున్నవి. క్రొత్తనుడులు. క్రొందెనుఁగు, క్రొంబాస, క్రొం క్రొం క్రొం క్రొం క్రొం మనదేహముల కారోగ్యకర మని యెన్నో చదివినారు. ఈచదువంతయుఁ, "పాడినదే పాడరా" అనునట్లు చర్వితచర్వణము పిష్టపేషణమును. ఇట్లున్నది వారిప్రాఁదెనుఁగుఁగమ్మ. దీనింబట్టి ప్రాఁత తెనుఁగు మరణించినట్టిది, వెగటు, కటువు, పాషాణము, కొఱకఁ బడదు, పనికి రాదది దేహారోగ్యకరము గాదు. క్రొత్తతెనుఁగు దేహారోగ్యకర మని వీరివాదము ప్రకటింపఁబడుచున్నది. హాహా! లోకములోఁ బ్రాఁతతెనుఁగుగాని క్రొత్తతెనుఁగెక్కడిది? ఎక్కడినుండి వచ్చినది? గ్రామ్యాచార్యులుగారు చెప్పునది ప్రాఁతతెనుఁగు కాదా? క్రొత్తగా వీరొకతెనుఁగును బుట్టించినారా? అదియేది? వీరిగ్రామ్యమా? గ్రామ్య మననేమి? మనప్రాఁదెనుఁగుమాటలకపభ్రంశము కాదా? అంతకన్న గ్రామ్య మెక్కడ నున్నది? పంతులుగారు తమక్రొత్తతెనుఁగేవో రెండుమాటలు వ్రాయఁ దలిగిరేని చూచి ప్రజలానందింతురే! కడచినదాని కేమి యిప్పుడైన ముద్దు లొలుకుక్రొందెనుఁగుమాటలతో రెండుబంతులు వ్రాయుదురుగాక. అట్లు వారు వ్రాయఁగలిగినప్పుడు లోకము వారిమాట విశ్వసించును. లేదేని యీయాఁకదంపుతోఁ బ్రయోజన మేమిటికి? ఈపాడిమాటలకుఁ గఱవేమి? వీరును వీరివారును—"బ్రాహ్మణులలో నూటి కఱువదిమంది పంచములవలె విద్యాశూన్య" లని పంచమస్వరముతోఁ బాడి పలుకుచున్నారు. ఇట్లు పలుకుట బ్రాహ్మణు లగువీరి కొప్ప దనియు, వీరివ్యావహారికగ్రామ్యము నింద్య మనియు, నియమరహిత మనియు, నసభ్య మనియు, నధమ మనియు, నయోగ్య మనియు నొక్కి వక్కాణించుచు నిప్పటి కింతతో విరమించుచున్నాఁడను.

---

## క్రొందెలుఁగురిమ్మ

పెసలోర! కయిలోర! భేమ్మర్లలోర!, మారాసులోర! వోకోంటోరులోర
సుద్దరప్పబులోర! సెప్పు తినుండు, నామలిగె గేమ్మ్రము రాసేటివోరు
సదిమేటివోరునూ సెప్పేటివోరు, లేరన్ను కల మట్టి నాను సూపిస్త
సూడోండి నాపెగ్ని నాసేతిమగిమ, ఆసార్లు లంటోరు ఆళ్ళకి డెల్లు

రాసటానికి సదస్మటానికి మాండ, తానికి నా నీళ్ళకంటె గోష్పద యీబాయి వుద్దరిచ్చెళ్ళిపోడాన్కి, వొచ్చినోడం జీమగాయిట్టు నోన బాగయిత్తా లెంకిమాటలు మాడి, గేమ్మోం బెపంచన్లో మాతి మోతాన్కి వొచ్చినోడం మేరు మెద్దది నాకు, నామేరు సెప్పితే నావోళ్ళ గోదు యిరుగోళ్ళు మొరుగోళ్ళు అందరూంబెమ్మ,రత మట్టి మొక్కేరు నన్ను నాంపెగ్గ యేం టనుగుంటురో యినుడు నాం జెపత, నాబాస బాంసకె బాసకా దండి చడికొత్తదాండి మీపాత లొద్దండి, పాతల్లో మస కూస్త గోని లేదండి సచ్చినబాసండి యిహ పాతమాస, యినటాన్కి రోతండి యినమండి సూస్తె సిలకమల్కుల్ మల్లె సిత్తర మాద్ది, నాసెప్పుకొత్తబా సెనువొంటి దంటె బంగోరమంటిది కడుపులో మశితె, దాంతోటి గలిసిమోద్దండి నోట్లోకి సులకంగ వుంటాది సూసేటికళ్ల, వొచ్చి మోద్దయ్యల్లు! అచ్చెంమ్మ కూంత మాలోళ్లు మండోళ్లు మరి సచ్చటోళ్లు, కొండోళ్లు కోయోళ్లు తూర్పోళ్లు గలిసి మోతారు మాటల్లో గందాలు సదిమి, సదిమినంతట్లో కయిత్తమూ వొచ్చి కతలు గమ్మలు రాసి కోట్లు కొట్లేను, మోగులు సేస్కుని మెళ్లాలతోను మిల్లలతో టింగు టింగుగా బతికి, కూకుండి చుకియిస్తు వుంటురు బాయి అంచేత మీపాతయబ్బేసమూలు, యిడిచి రమాండాలు సదుములు వొదిలి బారతబబ్బాలు మరికించ మోక, దరమయిరుద్దంగ నడక యెప్డున్న గేమ్మమే గేనము గేమ్మమే బెమ్మ, గేమ్మమే ద్రేఘము గేమ్మమే సామ్మ గేమ్మమే చర్వంను గేమ్మమే గేమ్మ, మంటున్న వుండాలి మదికివున్నాళ్లు చత్తెప్పెమానికం సేసి చెబ్తాను, గేమ్మమే గేమ్మము గేమ్మమే గేమ్మోం గేమ్మమే గేమ్మము గేమ్మమే గేమ్మోం, గేమ్మమే గేమ్మము గేమ్మమే గేమ్మోం.

| | |
|---|---|
| వారుమూడుమీద వేడున్నర యెళ్లో<br>పంగుణిపిల్లతల్లినెల యేడోనాడు<br>మూడోవోరం మయిడిగేమా. | యిల్లా,<br>తొండరడిప్పాడియేందో సులమా<br>దాలుమట్టుకున్నమంతిద్రిమంగయ్య. |

టిప్పణము:—పెసలు=ప్రజలు ; కయిలు=కవులు ; మారాసులు=మహారాజులు ; సుద్దరప్పబులు=శూద్రప్రభువులు ; నామలిగె=నావలె ; గేమ్మము=గ్రామ్యము ; సదిమేటి=చదివెడు ; కలమట్టి=లేఖినిబట్టి ;

పెగిని, పెగ్ని=ప్రజ్ఞ; మగిమ=మహిమ; ఆసాల్లు=ఆచార్యులు; బూయి=భూమి; వుద్దరిచ్చి=ఉద్ధరించి; చీమగాయిట్టు=శ్రీమహావిష్ణువు; బాగయిత్తాలు=భావకవిత్వాలు; మాతి=పాతి; మేరు=పేరు; గోదు=కాదు; బెమ్మరతం=బ్రహ్మరథము; చెవత=చెప్పెద; చడికొత్తది=సరిక్రొత్తది; మస=పస; మాస=బాస; అయ్యల్లు! అయ్యలార!; చుకియిస్తు=సుఖించుచు; రమాండాలు=రామాయణములు; భారతబబ్బాలు=భారతపర్వాలు; దరమయిరుద్దం=ధర్మవిరుద్ధము; గేనము=జ్ఞానము; దేహ్రము=దేహము; చత్తెప్పెమానికం=సత్యప్రమాణికము;

## గ్రామ్యాచార్యులు—వారిభాష.

"దిక్కుమాలినస్థితిలో మన దేశభాష ఉన్నది. (అది) కృతకగ్రాంథికభాష...ఎవరికి ఎట్లు ఉచిత మని తోచునో అట్లుసంభాషించడమునకూ, వ్రాయడమునకూ స్వేచ్ఛ ఉండవలె నని అంగీకరింపక తప్పదు" అని చెప్పుచు వ్యావహారికభాష యని పేరుపెట్టి గ్రామ్యభాష నుద్ధరింప బద్ధకంకణులై గ్రామ్యాచార్యబిరుదము వహించినరావుసాహేబు గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు తాము తమవ్యావహారికభాష నెంతవఱకు వ్రాయఁ గలరో యని వారు ప్రకటించినప్రాఁగమ్మ లోనగుచిట్టిపొత్తకాలలో వ్రాసినవ్రాఁతలనుండి వారికి గ్రాంథికభాష రాకున్నను వ్యావహారికభాష గని, గ్రామ్యభాష గాని, వ్రాయ రా దని లోకమునకుఁ దెలుపుటకు నే నుద్యమించితిని. నావ్రాఁతలలోనివిషయములు యథార్థము లని తోఁచినచో విశ్వసించి వారిభాషను ద్రోసిరాజనుఁడు. తోఁపనియెడల నా వ్రాఁతలం ద్రోసిరా జనుఁడు. ఇపుడు మచ్చునకై రావుసాహేబుగారు వ్రాసినయొకయుపోద్ఘాతమునుండి కొన్నివిషయము లుదాహరించుచున్నాను. చిత్తగింపుఁడు.

గ్రామ్యాచార్యులుగారు వ్యవహరించుభాష బ్రాహ్మణవ్యవహారభాష యంట! ఆవ్యవహార మెంతవఱకు సరిపడియుండునో మనము మున్నెఱుంగ నగు. "గిడుగు వేంకటరామమూర్తి" అని పీఠికలో వ్రాసికొనిరి. ఇట్లు వ్యవహారమం దుండునా? గొప్పవిద్వాంసుఁ డైనబ్రాహ్మణుఁడును "వెంకట్రాంమూర్తి" లేక "వెంకట్రామ్మూర్తి" అనియే పలుకును. వేంకట యని శాస్త్రీయదీర్ఘముతో పంతులుగారు వ్యవహరింతురా? వ్యవహ

రింప నప్పు డిట్లు వ్రాయుట యేమనిపించుకొనును? వ్యావహారిక భాష బహు విధంబు లనియు, అది సుకరము కా దనియుం దోఁచును. "గ్రంథము, యథావిధి" ఇత్యాదులద్వితీయవర్ణ మీభాషాప్రపంచమున మృగ్యము. చతుర్థవర్ణమే సర్వత్ర వ్యవహారము. వీ రీచిన్న యుపోద్ఘాతములో నంతటను ద్వితీయవర్ణమే వాడినారు. గ్రంథము, యథావిధి, ఇట్లే కలదు. ఈభాష యందుఁ బ్రథమైకవచనమువర్ణనమున కనుస్వారమే విహితము కదా! గ్రంథము, దోషము, ఉపోద్ఘాతము వీరు సర్వత్ర వ్రాసిరి. గ్రంథం, దోషం, ఉపోద్ఘాతం, ఇట్లే యార్యవ్యవహారమును. వీరిమువర్ణనమునకు గతి వారే కలిగింపవలయును. "ఏర్పరించుకోవడము" అని వాడిరి. "ఏర్పర్చుకోవడం" అనుటయే సాధువు. "పాఠకుల కుచితము" అనిరి. "పాఠకులకు వుచితం" అన నొప్పు. "అందరూ" అనిరి. సర్వశబ్దార్థ మైనదీనిని సంపూర్ణద్యోతకంబుగా "అంధరూ" అని యందురు. "ప్రత్యక్షమయేలాగున" అనిరి. "ప్రత్యక్ష మయ్యేలాగ" అని గోదావరీమండలవ్యవహారము. "అంతర్భూతమయినదే, తోచినది, వ్యాపిస్తున్నది" ఇత్యాదులు వీరు వ్రాసిరి. "అంతర్భూతమైందే, తోచింది, వ్యాపిస్తుంది" అందురుగాని నకారమును వాడరు. "వర్ణించినారు, చేసినారు" ఇత్యాదులును వీ రుపయోగించిరి. "వర్ణించారు చేశారు" ఇట్లే ఆర్యవ్యవహారము. "ఉండినట్లు, తోచినది" అనిరి ఉన్నట్లు, తోచింది" అందురు.

మరిఒకరు, అయిఉన్నది, అట్లే "ఉండవలెను" ఇత్యాదులు పంతులుగారిమాటలు. ఎవ్వరును, ఇ ట్లచ్చులు వాక్యమధ్యమున నుచ్చరింపరు. "మరొకరు, మరివొకరు, అయివుంది, అట్లే వుండవలె" అనియే యుచ్చరింతురు. ఇత్యాదులు బ్రాహ్మణవ్యవహారమందును లేనిపదములు వేనవేలు వీరు వ్రాసిరి. దీనింబట్టి చూడ గ్రామ్యాచార్యులుగారికి వ్యావహారికభాష కూడ రా దని స్పష్టపడుచున్నది. వీ రీవ్యవహారభాష నుపయోగింపవలయు ననుట గ్రాంథికము సర్వసులభము గా నుండ దనియు నిది సులభ మగు ననియును గదా! అందరూ, చూచారు, కలుగుతూ, ఎదిరిస్తున్నారు, అయి ఉన్నది" ఇత్యాదులు వీరిమాటలు సుబోధకములై "అందఱు, చూచినారు, కలుగుచు, ఎదిరించుచున్నారు, అయి యున్నది" ఇవి దుర్బోధకము లగునా? ఈమాత్రముఁ దెలియనివారికి వీరు ప్రయోగించెడు "ఉపోద్ఘా

తము, శిల్పివేత్తలు, గ్రాంథికము, పరిత్యజము, ఉల్లంఘిస్తూ. సామయికధర్మములు, రహస్యోల్లఘనము, స్వేచ్ఛాస్వాతంత్ర్యము, పాశ్చాత్యస్త్రీల అసాధారణవ్యత్యాసములు, తర్బీతు మొదలగునవి తెలియు నని వీరియభిప్రాయమా? ఇట్టివారే గదా దేశభాష దిక్కుమాలినస్థితిలో నున్నదనియు గ్రాంథికభాష కృతకభాష యనియు నన సాహసించువారు. ఇట్టివారు బయలుదేరి పనికిమాలినపాడుభాషలో గ్రంథములు వ్రాయ మొదలుపెట్టి నప్పుడు దిక్కుమాలినభాష యగు ననుటకు సంశయమా?

కావున నో మహాజనులారా! రావుసాహేబుగారు వాగనుభాషకు నియమము లేదు. ఎవరి కుచిత మెట్లని తోచునో అట్లు గ్రంథములు వ్రాయవలయు నని చెప్పుచున్నారు. ఆమాట యెంతవఱకు నుచితమో మీరే గ్రహించుకొనుడు. మిత్రులారా! మీరు హంసను విడిచి కాకిని గ్రహించినట్లు సర్వోత్తమమై "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" అని ప్రసిద్ధిఁ గాంచినగ్రాంథికభాషను విడనాడి ప్రాలుమాలి అపవిత్రమైనపాడు గ్రామ్యమును స్వీకరించి దానిని మీగ్రంథరాజములలో నపయోగింపకుందురుగాక యని కోరుచున్నాను.

---

## ఆంధ్రభారతవ్యాఖ్య.

ఇది భారతంలక్ష్మీపతిగారిచే వ్రాయబడి తణుకునందాశ్వయుజ మాసమున వెలువడినసారస్వతసర్వస్వమనుమాసపత్రికలోఁ బ్రచురింపఁబడినది. సారస్వతసర్వస్వ మని పేరుపెట్టుకొనినయాపత్రిక పరిశుద్ధమైనసారస్వతమునే ప్రకటించుచుండ వలయునుగాని సర్వస్వోత్తరపదముం బురస్కరించుకొని యపరిశుద్ధములైనగ్రామ్యాదులకుఁ జోటిచ్చుట కరము విచారకరము. దీనిస్వభావ మిట్లుగనుకనే గ్రామ్యభూయిష్ఠమైనయీవ్యాఖ్యను వహించినది. ఇది ఆంధ్రమహాభారతకూలంకషవ్యాఖ్యాన మని చెప్పుచున్నది. లఘుటిప్పణ మనుటకేని తగనిదీనిని కూలంకషవ్యాఖ్యాన మనుటకన్న నన్నృత ముండదు. ఒరసి యొడ్డుం బడఁగొట్టి జలాశయమునుండి జలమును బోఁగొట్టునది యనుధ్వన్యర్థము మాత్రము చెప్పినప్పుడు దీనికిఁ కూలంకషత్వము సిద్ధింపవచ్చును. ఎట్లయినను బరమలాక్షణికాగ్రగణ్యుఁడైననన్నయభట్టారకునిమహాభారతమున కీగ్రామ్యవ్యాఖ్యకళంక మాపాదించుట

కేర్పడినదికాని తత్తద్విశేషాంశముల వెల్లడించుట కేర్పడినది కాదని నాయభిప్రాయము. ఈగ్రామ్యవ్యాఖ్యమధ్యమునఁ గుమ్మరావములో "నిత్తడిముంతలు" అనునట్లు కొన్ని సంస్కృతవిషయములు చూపట్టు. తత్ప్రయోజనమంత ముఖ్య మన నొప్పదు. కేవలాంధ్రుల కది యర్థము కాదు. సంస్కృతపండితులకుఁ జర్వితచర్వణము. నే నిట్లు మాటలతోఁ జెప్పుటకన్న నావ్యాఖ్యనుండియే నామాటలం దార్కాణము చేయుచున్నాను. చిత్తగింపుఁడు.

శ్రీదయితోరస్థల—లక్ష్మిప్రియవక్షస్థల; అస్యరాజ్ఞః విష్ణ్వంశత్వా దితి భావః; దయాఅస్మిన్సంజాతాదయితం త్ర్యక్షర మితిభావః; విమలాదిత్యస్యాత్మజతి ర్థ త్యద్రో ద్రా అనేది దీర్ఘవర్ణము. "ఒండుం దుదగురువు జగణ ముండదు బేసిఁ" అని లక్షణము. 1, 2, 3, 4, 5, 6, 7, ఇన్నిపద్యములకు నిదియే కూలంకషవ్యాఖ్య. శ్రీదయితోరస్థల= ఈరాజు ఱొమ్మమీఁద లక్ష్మిదేవి కూర్చుండు నని యభిప్రాయము వ్యాఖ్యాతకుఁ గలదు కావున రాజు విష్ణ్వంశసంభూతుఁ డని వ్రాసినాఁడు. తదంశసంభూతుఁ డనినంత మాత్ర విష్ణువై విష్ణువునకుం జెప్పఁ దగినవిశేషణము లన్నియుఁ బొంద నర్హుఁ డగునా? అట్లయిన—లక్ష్మినాధ, మారజనక, వైకుంఠ, గరుడధ్వజ, ఇంద్రావరజ, చతుర్భుజ, మధురిపు, బలిధ్వంసి, ఇత్యాదులు రాజనరేంద్రున కుపయోగింప వచ్చు ననియే కదా వ్యాఖ్యాత యభిప్రాయము. చాలు. చాలు. ఇట్టికువ్యాఖ్యానములు చేయుటకన్న నూరకుంట మేలు. "భారతీకాళిదాసస్య కువ్యాఖ్యావిషమూర్ఛితా" అని మల్లినాథుఁడు చెప్పినది నా కిట జ్ఞాపకమునకు వచ్చినది. ఇట లక్ష్మిదేవి వక్షస్థలమునం దుండు నను నభిప్రాయముకన్న "దయతే చిత్త మాదత్త ఇతి దయితం. దయదానగతిరక్షణహింసాదానేషు" దీనింబట్టి శ్రీ—సంపద, ఐశ్వర్యము, శోభ, అలంకారము, చేత మనోహర మయినవక్షస్థలము గలవాఁడు. (విశాలవక్షుఁడు) ఇది రాజలక్షణ మని చెప్ప నొప్పు. పెద్దబ్రహ్మాండముగా "విష్ణ్వంశసంభూతత్వాత్" అనవలయునా? ఈమొదటిపద్యము సుగమ మని కాఁబోలు! విమలాదిత్యాత్మజ=విమలాదిత్యునికొడుకు, అని మాత్రము చెప్పుటకు అత్మజతీర్థ త్యద్రో ద్రాఅనేదిదీర్ఘము. (ఇట నచ్చుతప్పో సంపాదకునితప్పో కలదు. ద్రా దీర్ఘవర్ణ మని సులక్షణసార మొలికినారు. ఇంత మాత్రము తెలియనివాఁ డుండునా? ఉండిన వాని కీ "తుదగురువు"

అనునదిమాత్రము తెలియునా? "నామూలం లిఖ్యతే కించి న్నానపేక్షిత
ముచ్యతే" అని మల్లినాథుఁడు చెప్పినట్లు వ్యాఖ్య లుండవలయును. గాని
అనపేక్షితములం బేర్కొనునట్టివి సువ్యాఖ్యానములు నాఁబడవు. ఈ 7 పద్య
ములలోఁ దెలియనివిషయము లని యింతమాత్రమే చెప్పినాఁడు. తక్కినవి
సుగమము లని కాఁబోలు వ్యాఖ్యాత విడిచి 8 వ పద్య మందుకొనినాఁడు.
ఈపద్యములలోనిభావార్థములమాట కేమిగాని 4 వవచనములో "అర్జునుం
డచ్యుతుమొగంబు సూచి యితని నెద్దియేని నొకయపూర్వం బయినదాని
నిర్మింప నియోగింపు మనిన" అని యున్నది. ఇట్లు వ్యాసభారతమం
దున్నదా? నన్నయ యిట్లు వ్రాసినాఁడా? సంపాదకు లిట్లు సంస్కరించి
నారా? మూలమందుఁ గలపరమార్థ మేమి? అని విచారము చేయకపోవుట
వ్యాఖ్యానలక్షణము కాదు. ఉన్నదానికి గతిం జూపుటయె కాని లేనిదా
నికిఁ గా దందు రేమో! ఈవ్యాఖ్యాతయే 47 వపుటలో "అత్ర భగవదవతా
రాః భీష్మోక్తాః నత్వాంధ్రే" అని వ్రాసియున్నాఁడు. మూలములో—
"మయుఁడు నీ కేది యే నుపకృతిం జేయుదుం జెప్పు మనిన నర్జునుండు
మయునిం జూచి నాకు నీ వుపకారము చేయ నక్కరలేదు. కాని కోరు
చుంటివిగావున నాకుఁ జేయదు నన్నపరమోపకారము నాకుఁ బరమగురు
వైనయాశ్రీకృష్ణునకుం జేయు" మని చెప్పెను.

తే. నా కొకింతయు నిష్టము లేకయున్న, నీదుసంకల్ప మది రిత్తగాఁ దలంప
నాకుఁగా జేయుదునటంచువాకొనుది, ఘనుఁడు శ్రీకృష్ణునకుఁ జేయుగడగుమయ్య

అట్టిపరమార్థము తెలుఁగున మృగ్య మైనది. ఈవిషయము వ్యాఖ్యాత
పరిశంసింపమి యవిమర్శ మనక తప్పదు. 7 వ పద్యములో "ఇంద్రదను
జేంద్రులకంటె" ఇందు దనుజేంద్రుఁ డెవ్వఁడో చెప్పనక్కఱలేదా! 8 శోల్లి—
యౌవనాశ్వుండనురాజర్షి చేత "నిహితాయువనాశ్వేన రాజ్ఞా" మూలములో
యువనాశ్వుఁ డని యుండఁ దెలుఁగులో యౌవనాశ్వుఁ డనుట కేమికతమో
వ్రాయవలదా! ఇప్పటిముద్రణములయం దీరెండింటికి నభావమే. భానాదిత్యుఁ"
డని మొటనుండియో తెచ్చి పాఱవైచినారు. "దేవదత్తంబనుశంఖంబు.
అనగా దేవతలిచ్చినదిగాక యిదిమఱియొకటియని తెలియవలసినది" అని
వ్రాసెను. అర్జునునకు రెండు దేవదత్తశంఖము లున్నవా? రెండవ దేవదత్త
మెప్పుడు వచ్చెను. దేవదత్తమనుశంఖ మనఁగా దేవదత్తము శంఖనామము

కాదా? "ద్వారావతీపురంబునకు ద్వారవతినుండిజగదాధారుఁడు అని ప్రయోగము" దీనియభిప్రాయ మేమి? 8, 9, 10, "విమలకుట్టిమములన్" బద్ధభూములచేతను. కుశాదిగణములోనిది" దీనికి నావివరణము నిరవసరము. 11, 12, సురుచిర రాజతాసిరాస్యాద్యైవసితాబ్జాని శ్వేతగరుతశ్చ రజతమితి కేచిత్ భ్రాంత్యాఆహుఃతన్నసత్ నృషిరంజిభ్యామిత్యాదినాతజ్ కిత్ రజతంప్ర షతమితి" అని వ్రాసి రామాయణములోని "సుతులందమ్ముల" అనుపద్యము వ్రాసి యుదాహరణము చూపినాఁడు. నన్నయప్రయోగమునకుఁ బ్రమాణము రామాయణము. వ్యాఖ్యాత వ్రాయఁదగినవాని కర్థములు వ్రాయ లేదుగాని14 నానావిధయంత్రంబుల=జలయంత్రాదులచేతనున్న, విటంకములు=కపోత పాలికలు (టీకాపి సంస్కృతమేవ) ఇట నన్నయ—"నానాయంత్రంబులు, అనవరతకుసుమఫలభరితంబులైనతరువనంబులును, వికలకమలకుముదాభిరా మంబులైనజలాశయంబులును; వివిధవిచిత్రపతాకావిలంబితతోరణవిటంక ప్రదేశంబులును గలిగి దశకిష్కుసహస్రప్రమాణవృత్తాయతంబును...నపూ ర్వసభాభవనంబుఁ బదునాలుగునెలలు నిర్మించి దాని నెనిమిది వేలరాక్షసకిం కరుల మహాకాయుల మహాజవసత్వసంపన్నుల నంతరిక్షచరులం బనిచి మోపించుకొని వచ్చి ధర్మరాజున కిచ్చి" జలాశయములతో వనములతో నున్నసభాభవనమును మోపించుకొని వచ్చె నని సంస్కృతమున నున్నదా లేదా? ఇది స్వభావసిద్ధమా కాదా? యని విచారము వ్యాఖ్యాత చేసి యుండ లేదు. మయుఁడు ఖాండవప్రస్థపురమున మొదట స్థలము నిర్ణయిం చుకొని దానికి సరిపడునట్లు బిందుసరోవరముకడ తత్సామగ్రి రాక్షసులచేఁ గట్టడము పై కప్పు మొదలగునవి యమర్చుకొని వానినెల్ల రాక్షసులచేతం దెప్పించి ఖాండవప్రస్థమున మయసభ నిర్మించినట్లు మూల మందున్నది. ఇక్కడ నే తోటలు మొదలగునవి నిలిపిన ట్లున్నది. దీనిం గూర్చి వ్యాఖ్యాత చర్చిం పక విడుచుట శోచనీయము. 21 ఇందుఁ గొందఱు ఋషులపేర్లకు వ్యుత్పత్తులు చెప్పి కొన్నిటికిఁ జెప్ప లేదు. ఈవ్యుత్పత్తులు తెలుఁగునం దంతముఖ్యములు గావు. 32 కడ—"నీమంత్రిముఖ్యుఁడునీనగరులోనున్న రాజపుత్రులతోననుకూలముగావున్నాఁడుగదా" ఈయర్థ మేమో తెలియదు తెలుఁగుభారతము లో—మంత్రిపెం పడరఁగ రాజపుత్రులమహాధనవంతులఁ జేసివారితో నొడఁ బడిపక్ష మేర్పడఁగనుండఁడుగాధనమెట్టివాఁడికిం గడుకొనిచేయకుండునె" దీనికిఁ

బై వాఖ్యతగునో తగదో విజ్ఞులూహింతురుగాక. 40 అనఘు—"అనుపోష్యులను=దారపుత్రాదులను, ప్రోతె=సగముజీతము యిస్తూవున్నావా అనుట" "అనుపోష్యుల నెల్లను బ్రోతె భోజనాచ్ఛాదనముల" అని నన్నయభారతము దీనికే సగముజీతము యిస్తూవున్నావా అనుట యేటో దెల్దు. 44 హీనులకు — "కాపులకువడ్డీలేకుండావిత్తులు, కూలిపనులున్న బేహారులకు నూటికివొకటివడ్డీగా బదుళ్ళున్నూ యిస్తూవున్నావుగదా" దీనికి—"కర్షకులకు ధాన్యంబు బీజములు, వణిజులకు శతైకవృద్ధిగా ఋణము లిత్తె" అని భారతము;

65 అతుల— "అప్సరసశ్చతా అంగనాశ్చ అప్సరోంగనాః" అని మాత్రము వ్రాసి "వరాప్సరోంగనాయతవిలసత్కటాక్షకుసుమార్చితసుందరచంద్రవక్త్రుఁడై" ఇందలిచంద్రాదిశబ్దస్వారస్యమును దెలుపమి కొంత యే కదా! 70 అదియును—"నేనుఅనఁగా నారదుఁడు" ఈనేను శబ్దమిప్పటిపుస్తకములలోఁ గాదు ప్రాఁతతాళపత్రగ్రంథములందును మృగ్యమే. 75 అందు— "కుత్సింబేరంశరీరంఏకపింగత్వాదిలక్షణంయస్యసఃకుబేరఃసహపత్న్యామహారాజఋధ్యాతస్యాంవిరాజతే. సర్వాభరణభూషిణ్యాపుష్పదంతో ధనేశ్వరఇత్యుక్తం"

"కం. అందుఁ గుబేరుఁడు పరమా,నందంబున నుండు ధర్మనందనవిలస
న్మందారపారిజాతక,నందనమందానిలాభినందితుఁ డగుచున్."

అనుపద్యమునకే పై వ్యాఖ్య. వ్యాఖ్య సులభమో? పద్యము సులభమో? చదువరులె గ్రహింతురుగాక. 76 అతని—"హేమనేత్రుఁడు అనగా హిరణ్యాక్షుఁడు కాఁడు. హిరణ్యాక్షుఁడు మూడోజన్మమందు దంతవక్త్రుడై పుట్టివున్నాడు. విభీషణఃకుబేరానుజపన-యక్షులుఅనగాయక్షులున్ను అనుట-ఉపలక్షణము-ఊర్వశి, తిలోత్తమ, ఘృతాచి, మేనక, ఇవివ్యస్తపదములుగనుక దీర్ఘము లోపించినది. దీర్ఘాణాంహ్రస్వఃస్యా దితిసూత్రం-రంభాప్రభృతులు అనేదసమస్తపదము" పైవి వ్యస్తపదములైనచో రంభాప్రభృతులైనయప్సరసలనుట యెట్లు? వ్యస్తము లెట్లన్వయించును? "ఊర్వశీతిలోత్తమాఘృతాచీమేనకారంభాప్రభృతలైన" అనియే గ్రంథములఁగానవచ్చెడిని. ఇదియే సాధువు. 77 వానికి—"అహీనోవాసుకిఃఈశ్వరఃఉమాపతిః" అని వ్యాఖ్యచేయనేమిటికో? ఈమాత్రము తెలిసికొననివాఁడుండు

నా? ఉండిన నివి తప్పుఁ దక్కినయిందలిపదము లన్నియు నర్థ మగునా? చిత్తగింపుఁడు పద్యము:—.

“ఉ. వానికి నెయ్యుఁడై యమరవంద్యపదాంబుజుఁ డంబికాబృహ
త్పీనపయోధరాగ్రపరిపీడితవక్షుఁడు భూషణీకృతా
హీనుఁ డశేషలోకగురుఁ డీశ్వరుఁ డొప్పును నంద యుండు నా
నానిశితాయుధాయుతసనాథమహాద్భుతభూతకోటితోఁ.”

83 జయశీలు—“తృప్తిచేసె అనేది అతర్పయత్ అనేక్రియకు విగ్రహముగనుక విగ్రహసమాసములయందు గజడదబరూపమురాదు. “తృప్తి సేసె” అను దాని కీవ్యాఖ్యానము. తగి యుండెనో? 106 కురు—.“అరిసూదనశౌర్యులు” అని రిది యేమివ్యాఖ్యయో? “అరిసూదనశౌర్యులైన యనుజులబలిమిఁ” అని మూలము. 107 తొల్లి—“సామర్థ్యముచెప్పికొ అకుఅశక్యంఅనగామయూసశక్యతెఅనిభావేప్రయోగము” 109 ఆయత—“అనిర్జేయులు నిర్జితు మశక్యులు.” నిర్జితుం అను సంస్కృతముపై అశక్యులు అనితత్సమము. సిర్జితుం అనునది తప్పు. నిర్జేతుం అని యుండవలయును. 110 ఆయిద్దఱు—“పాంచాలమత్స్యులు తమదేశాలు విడిచి అమలాపురము, బందరున్ను చేరినవారని చెప్పవచ్చును.” పీఠిపురాణార్థమిట్టిదే. 111 ఘోర—“కంసభార్యాఅస్తిగ” 144—“బలియకావగచి=దిగదుడుపుగాతల్చుకొని” 155 ఇక్కుమారుడు—“నడునడ=నడకయొక్కనడుమునందు తాకకమును పీయనుట. అవిలంబార్థవ్యయీభావగ” ఇది యెక్కడిదో యేమో తెలియదు. ఇఘ్లీపత్రియందును లేదు. 156 తనియు—“యూం (యూ) వను అనే దిక్కున ద్విత్వములేదు. పూచి, పూంచి, అనివుంచున్నది. నకారము వుండిపోయినదిక్కున పూర్ణబిందు వేవుంచుంది”. 158—“అయుగశుభావహావిధిగ నయోనితి పక్షతిగ పక్షమూలం అయిన అనేదిక్కున ఐన అనివ్రాస్తేప్రాస చెడిపోవుచున్నది” ఇట పద్యము చూచి యావ్రాత కానందింతురు గాక. 160—“బలిమిమేయి=బలవంతుడవుటచేత” అనెను ఇది ధర్మముకాని ధర్మి కాదు. బలిమికి బలవంతుఁ డనునర్థము కలదా? 189 అతుల—“ఉగ్రతపంబుచేసిన సురపూజచేసిన ఇవిరెండున్ను రెండేసిపదములు కలవుగనుక విగ్రహములు కావు. ద్వితీయావిభక్తులు గనుకఁ జకారములు వచ్చినవి” దీనికిఁ బాఠకులే యర్థము చెప్పుకొని సంతోషింతురుగాక. “అతులవిక్రమసం

పదఁ రణయజ్ఞదీక్షితులై రిపుప్రతతి నోర్చి సపీరు లుగ్రతపంబు చేసినవారు" అని పద్యము. 214 తొల్లి—"తారకామయసంగ్రామంబున అనగా బృహస్పతిభార్యయైన తారనిమిత్తమై అయిన దేవరాక్షసయుద్ధమందు అనుట..." "సంగ్రామే తారకామయే" అని సంస్కృతము. తారక+ఆమయము=తారకాసురునివలన సైనికరోగరూపమగుయుద్ధ మనియే మూలార్థము. బృహస్పతిభార్యామయ మైనయుద్ధ మనుట చింత్యము. ఇప్పటిప్రతులలో "దారకాసురసంగ్రామంబున" అని చూపట్టెడిని. 125 నరసుతు—"తెరలగ=తర్లిరాగా" ఇక్కడ నీయర్థముకన్న దెరలు=కలుగు. ఈయర్థమే యుత్తమ మయినది. 241 అతని—"శిశుపాలుడు=ధర్మరాజుపినతల్లికొడుకు" 262 పరగఁ— "అగురు అగరు అనిన్ని కలదు. విశ్రములోనున్నది." వారు చూచినప్రతిలో నెట్లున్నదో కాని యిప్పటిప్రతులలో "చందనా గురుకాష్ఠాదులుకప్పముల్ గొనియెఁ బెక్కుల్" అని యున్నది. ద్వితీయాశ్వాసము-12 పురుషవిశేష—"అతిశాయి చేత అభిష్ఠకాముఖగద్వితీయవర్ణగఖకారగ" ఇది విత్తమునకు వచ్చినది కాఁబోలు!

ఇట్లీసంచికలో 24 పుటలుగా వ్యాఖ్య ప్రకటింపఁబడినది. ఇందు—చేతనున్ను; నిత్యమున్ను, వారినిన్ని, జీతముయిస్తూవున్నావా, చోరభయం లేకుండాచేస్తూవున్నావా, పుట్టివున్నాడు, కుంటివాళ్ళు, మూగివాళ్ళు, లేకపోతే, తల్చుకున్నావుకదా, నుతిన్ని, చేస్తే; వారు యెందుకువున్నారంటే, చూచేటప్పటికివున్నారు. చెప్పేటప్పటికి, తృప్తిచేసేఅనేది, అనేక్రియకు, చేసుకొని, కూతుళ్ళు, తల్చుకొని, పూంచిఅసివుంచుంది, పక్షమూలం అయిన అనేదిక్కున, వినఅనివ్రాస్తే, మల్లయుద్ధం, బాహుయుద్ధం, పదకొండుగుర్ని తినే, కనే, అనిన్నివున్నది, మన్యకాళ్ళనున్ను, పినతల్లికొడుకు, చదువుకుంచూ, సక్తుడవుకుంచూవుండగా, తినేవాళ్ళు, చవక, అతిచవక, ఇవ్వవలయునదివద్దవున్న, అక్కడవుండేవారు, వానసులు అయివున్నారు, పూజితుడవుకుంచూవుండగా, చూచినవాడవుకుంచూవుండగా, యోగ్యుడేవేకదా, ఆలాగే, పెళ్ళిఅయిన్ని, చంపవలసివస్తుంది, తీసుకురాగలందులకు, ఇత్యాది గ్రామ్యము లీవ్యాఖ్యాభూషణములు.

పాఠకమహాశయులారా? ఈవ్యాఖ్య యెట్లున్న నుండునుగాని పరమపవిత్ర మైననన్నయభట్టారకుని మహాభారతమున కిట్టిసిచగ్రామ్యపదము

లతో నిండియున్న వ్యాఖ్యానము నింద్య మని దీనిని నిరసించుబుద్ధితో నిట్లు కొంచెము వ్రాసి మీకు విసుగు పుట్టించినందులకు మన్నింపఁ బ్రార్థితులు. మచ్చున కిట్లు విమర్శించితిని. నాకు వ్యాఖ్యాతపై నీర్ష్యాసూయలు లే వనుట నిశ్చయము. ఇంతమాత్రముచేత నే దీని బండారము మీకుఁ దెలియ వచ్చినదిగావున నింక నీపై నీవిషయము మరల నీపత్రియందుఁ బ్రకటింపము. ఈవ్యాఖ్యను మెచ్చుకొనినగిడుగు వా రింపలిభాష నంగీకరింతు రేమో!

---

కొత్తతెనుగుపంతులు

(ఇక్ష్వాకంటాక్సుత మాశ్శీలుదారు—పప్పు మల్లికార్జునరావుగారు బి. ఏ.)

రంగము—స్కూలు.

పంతులు—ఏమి రా నాలుగోక్లాసుపిల్లల్లారా, ఏంచేస్తూన్నారా?

రామారావు—మీరు మొన్న చెప్పిన వెధవ తెనుగుసొద రాశామండి.

పంతులు—"వెధవ తెనుగుసొద" ఏమిటోయ్, కొత్తతెనుగును తిడుతున్నావాఁవిటి?

రామారావు— అబ్బే, తిట్టడంలేదండి, రాశినదానికి పేరల్లా పెట్టేను వితంతువులగూర్చి తెనుగువ్యాసమొకటి కొత్తతెనుగుతో రాయమన్నారుగాదా మీరు? సంస్కృతపదాలు సాధ్యమైనంతవరకు రానియ్యవద్దన్నారని అల్లా పేరుపెట్టేను.

పం—ఓరదిట్టా, నీవుద్దేశమ్మంచిదేకాని మాటలు సరిగ్గా పడకపోవడంచేత అపార్థంవస్తోంది. "వెధవ" అంటే కర్ణకఠోరంగావుంది. అదితీసేసి "వితంతువునుగూర్చి" అనేరాయి. తరువాత "సొద"ంటేబాగుంది కాదు. "వ్యాసము"నేవుణ్నియ్యి. సరే. తరువాత అసలు సంగతేంరాశావు చదువు.

రామా—మనదేశంలో వెధవలసంఖ్య రానురాను హెచ్చవడం చూడగా ఏడుపొస్తూవుంది.

పంతులు—ఏడ్పేఁవిట్రా! ఏడిసినట్టేవుంది. విచారమనిరాయి. తరవాత.

రామా—వారిలో కొందరు శిరోజములుకలవారుగను మరికొందరు లేనివారుగను రెండుకక్షులుగా చీల్చబడినారు.

పం—"శిరోజములు" అంత పెద్దమాటెందుకు? "వెంట్రుకలు"చాలును.

పేరుమీరాసాహెబు—బొచ్చంటేనోండీ, పంతులుఖారూ!

పం—ఒరే, నువ్వు తురకాడవు నీకు తెనుగు తిన్నగా రాదు పక్క నున్న పిల్లకాయల్ని చూచి నేర్చుకో.

షేకు—అరే! మల్లీపిల్లఖాయా, గిల్లకాయా యెందుకండీ, మాయింటి ఖాడా ఎల్లామాటల్ సేస్తే అల్లా రాయి వుండాయి అంటూ మున్న సెప్పేర్ ఖాదా మీరు?

పం—నువ్వు బొత్తిగా తగలేసేలావున్నావే భాష ఇంటికాడ హిందూస్తానేమాట్లాడుతావు అకంతా రాద్దామనుకున్నావా ఏఁవిటి?

షేకు—యింటిఖాడా మాలోమేం హిందూస్తానీమాటల్ సేసినా మీవంటివాళ్లొచ్చినప్పుడు సేసేమో స్తర్ రాస్తాం. మాఖీఖూడా రాతలో ష్వేచ్ఛవుండాలీఖాదూ!

పం—నీకు కొత్త తెనుగు సాంప్రదాయమే తెలవలేదు. మధ్యరామాయణంలో పిడకలవేటలాగ కొత్తగొడవ తెస్తూంటావు. రామారావూ తరువాత చదువు.

రామా—కడపటి జాతివారు బ్రాహ్మలలో విస్తారముగాను కోమట్లలో అక్కడక్కడను మాత్రమున్నారు.

పంతులు—కడపటి జాతేఁవిటి? మాలాళ్లా, మాదిగాళ్లా.

రామా—అది కాదు. మీరు సందర్భం మరచి పోయి నట్టున్నారు. శిరోజములు కలవారొక జాతి లేని వారొక జాతి అని కదా యిది వరలో రాశాను ఈరెండింటల్లో కడపటి దన్నమాట.

షేకు—అరే, బొమ్మన్లు సావుకార్లే నా సికీతోచిండి మాంకూడా ఆజాతిలో పడ్డాంగాఁవోయి.

పంతులు—ఓరే, సాయీబూ నువ్వకాస్సేపు మాట్లాడకు. నీసందేహాలు తరవాత తీర్చుకోందుగాని రామారావూ, నువ్వురాసిందాల్లో చాలా అవకతెవకలున్నాయి. ఇప్పుడీ స్వల్ప పీరియిడ్డులో దిద్దడం అంటే వెలుగుబంటికి తంటసప్పని లాగ తేలదు. ఒక ఆదివారం నాడు సావకాశంగా చూడాలి. ఏదీ నీతరవాత వాడేం రాశాడో చదవమను.

(తరువాత మంగలి వెంకన్న అను కుర్రవాడిట్లు చదువుచున్నాఁడు)

వెంక—ఎదవోర్వు అన్ని దేశాల్లోనువున్నారు. కాని మనదేశంలో బావనోళ్ళల్లో వున్నట్టు మరెక్కడనులేరంట. ఆళ్ళుపరోపకారంగా బతుకుతారు ఆళ్ళుండబట్టి బీదలకు తిండి దొరుకుతోంది.

పంతులు—అంటే యేమిట్రా వెంకన్నా.

వెంక—ఏమోనండి. మాబాబా బల్లా సొప్పేడండి. మరే జాతంలో అయినా ఆడది మంగలోడికి డబ్బిస్తుందాండి.

పంతులు—ఓరడిట్రా. మీబాబు నడిగిరా శావా ఏంవిటి యిదంతాను.

వెంక—మరినానుయింటి కాడకనుక్కొందేయింటి కాడమాట్లాడి నట్టెల్లా రాయమన్నారండి?

కంసాలిచిన్నయ్య—యింటి కాడేంటిరా నచ్చెదవ యింటి దగ్గరఅను.

పంతులు—ఒరే, కాడ అనేది మంచిమాటేరా. కడ అనే మాట సాగిసాగి కాడ అయిందిరా అది వాడితేనే నిజమైన భాషాస్వరూపం తెలియడం.

చిన్న—శిన్నం బంగారం సాగ్గొట్ట సాగ్గొట్టగా కాడయినట్లాండి.

పంతులు—అద్దుగదిరా ఉపమానం చెప్పడంలో కాళిదాసుని చావగొట్టేవు నువ్వు. సరి దానికేమి ఒరే వెంకన్నా నువ్వు రాసింది కొంత దార్లోకి వస్తోంది కాని యింకా చాలాదిద్దాలి. నువ్వు కూడా ఆదివారంరా. (గంట మోత వినబడును) అదుగో పీరిడ్డు అయిపోయింది నేను వెళ్లాలి.

(అని నిష్క్రమించును)

2 రంగము—పంతులుగృహము.

(పంతులు యింటిలో చావడిలోగూర్చుండి వ్రాసికొనుచుండగా నాగిశెట్టియను వర్తకుడు ప్రవేశించుచున్నాడు.)

పంతులు—ఓహోహూ! నాగిశెట్టిగారా, దయచెయ్యండి దయచెయ్యండి. వారంరోజులనుంచి ఎక్కడా దర్శనంలేదేం?

నాగి—దర్శనాలెల్లావుంటాయి, లాబాలు గూబల్లోకొస్తాంటేను మీరుచేసేదానివల్ల. వూళ్లోఅయినా వ్యాపారంశేసుకొని బతక్కుండా యిక్కడగానికూకోమన్నావా ఏటయ్యా?

పంతులు—అదేమన్యాయము! నానెత్తిమీద దోర్లిస్తున్నావు! నేనేమైనధరలు హెచ్చించడంగాని తగ్గించడంగాని చేశానంటావా? నాస్కూలేమిటో నాగొడవయేమిటో అదేకాని వ్యాపారాలేం తెలుస్తాయినాకు. ఎటొచ్చీ నీవెప్పుడైన కాస్తవుత్తరంముక్క రాశిపెట్టమంటే—

నాగి—అదుగదేకొంపమునిగింది. వెనుకటయ్యవోరు సరిగ్గా రాశేవారుగందాఅని ఆయనకి బదిలీగావొచ్చేవు నువ్వుకూడా రాస్తావని ఓపావలా

డబ్బులుతింటావని అనుకున్నాను. అదే నేంచేసినతప్పు ఇదిగో యీవుత్తరం చూసుకో తెలుస్తుంది. (అని జేబులోనుండితీసి ఒకవుత్తరమునిచ్చుచున్నాడు.)

పంతులు—(ఉత్తరమువిప్పి)

"మహారాజరాజశ్రీ కె. నాగిశెట్టిగారి సముఖమునకు. ఆర్. అప్పాసామి వ్రాసుకొన్న విజ్ఞాపనము. ఉభయకుశలోపరి,

గతమాసములో మేము మిమ్ములను 100 మూటలు మంచిజొన్నలు పంపించమని కోరియుండగా, మీరు జొన్నలసంగతి వ్రాయక 100 బస్తాలు మంచిసరుకు రైలుమీద తోలేస్తూన్నామని వ్రాసినారు తోలుమాకక్కర లేదు. మేము తోళ్లవర్తకులముకాము. ఆసరుకు వాఫసుచేస్తున్నాము. గనుక రాకపోకఖర్చులు మీరేభరించవలెను.

మరిన్ని సన్నకొబ్బరితాళ్లు 200 పంపించమని వ్రాసివుండగా సరుకు మంచిదిగావున లావుగా పంపించినామని వ్రాసినారు. లావుతాళ్లు యిక్కడ చెలామణీకావు. గనుక ఆసరుకున్ను వాఫసుచేయవలసివచ్చినందులకు విచారించుచున్నాము. మేము కోరినది మీదగ్గరలేనప్పుడు లేదని వ్రాయడము ఎంతో ధారాళముగా వుండునని విన్నవించుకొనుచున్నాడను.

వరంగల్. చిత్తగించవలెను,

కార్తీకబహుళదశమి<br>గురువారం } ఆర్. అప్పాసామి.

నాగి—చూశావా పైగా చీవాట్లు కూడాను సరుకా చెలామణీ కాలేదు. ధరమంధం అయింది ఈనష్టం ఎల్లా భరించడం?

పంతులు—సరే. తెలిసింది కొన్ని మావేపువాడే మాటలు వాళ్ళకర్థంగాలేదు. వాటి కర్థం యిప్పుడు విప్పి చెప్పూతూ తిరిగి వ్రాస్తే నీకు క్షమాపణచెప్పూతూ తిరిగి జవాబు వెళ్ళి పోయి వస్తుంది.

నాగి—క్షమాపణ వస్తే వొలికిందా ఏంటి? సరుకు వదలాటం ఎల్లాగ?

పంతులు—చూడూ ఒకపని చెయ్యి నన్ను వెళ్లమంటే వెడతాను. తక్షణం యీసాయంత్రం మెయిల్లో ఒకరిని ఎగస్ప్రెసుగా అక్కడికి పంపించి యిది మాటలతేడా వల్లవచ్చింది గాని సరుకు మీరు కోరినదే అని నచ్చేటట్టు చెప్పించాలి.

నాగి—ఆ! కాగితమ్మీద యింతగా రాశావు. ఇకనోటిమాట లాళ్ళకు తెలిశేటట్టు చెబతావు. పైగా నీకు రాకపోకలకు రైలు ఖర్చులు బత్తికర్చు కూడా దండగెట్టుకో మంటావు.

పంతులు—పోనీ టెల్లిగ్రాం ఇయ్యి స్వల్పఖర్చుతో పోతుంది.

నాగి—అది బాగావుంది ఇంకా అలాశెయి ఇదుగో రూపాయి దాల్లో అయినా మాటలు సరిగ్గా రాయిబాబూ.

పంతులు—అది సుబ్భరంగా ఇంగ్లీషుని రాస్తాంవోయి వెర్రివాడా, ఆభాషలో రాస్తే యిలాటి తేడాలుపడవు.

నాగి—ఉఁ వెనకటయ్యవోరు తెనుగులో రాసేవాడు కాడేంటి ఎప్పుడైనా సరుకు తిరిగి రావడం ఉందా? కాని బేగెల్లు.

పంతులు—ఇదుగో బజారు కెళ్ళి కూర కొనుక్కొని వెళ్ళిపోయివచ్చి టెల్లిగ్రాం యిచ్చేస్తా.

నాగి—ఓరి, నీకూర బంగారంగాను, నేను కొట్టు కాణ్ణించి పంపిత్తా లేవయ్యా, ఎంతపిరంగావున్నా కూరలేందే బోంచెయ్యరు మీబామ్మర్లు అందుకే సంసారాలు ముందు కొస్తున్నాయి.

పంతులు—(తనలో) నీకు ప్రియంగాని నాకు ప్రియమేఁవిటి? (ప్రకాశముగా) సరే. అల్లాయితే వెళుతున్నా.

(అని నిష్క్రమించుచు, తనలో ఇట్లకొనుచున్నాడు)

నన్ని రాజమహేంద్రవరం పర్లాకిమిడి నుండి ప్రత్యేకము కొత్త తెనుగు అభివృద్ధి చేయడానికి పంపించారు. ఇక్కడి కుర్రవాళ్ళకి దీనియంద భిరుచివున్నట్టు తోచదు. కింది క్లాసువాళ్ళకి బోధపడక అశ్లీలాలు రాస్తున్నారు. పైక్లాసువాళ్ళు కుశ్శంకలు చేస్తూ గ్రాంధికభాషే వ్రాతకనుకూలమైన దంటారు. పోనీ వర్తకులు రాసుకొనేవుత్తరాల్లో ఎక్కిద్దామనుకుంటే సరుకు దండు గొచ్చిందంటాడు నాగిశెట్టి. ఇదంతా చూడగా ఇప్పుడు ఇక్కడ అనుకూలముగా కొత్తతెనుగు వృద్ధి పొందే యోగంకనపడదు.

శ్రీరస్తు

# భారతకథామృతము.

## ఆదిపర్వము.

### ఇష్టదేవతాప్రార్థనాదికము.

శ్లో. నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.

శా. శ్రీనాథార్చితపాదపద్మయుగళున్ శీతాంశుమౌళిన్ మహా
మానీంద్రాద్రినివశున్ బరాత్పరునిఁ బ్రేమస్వాంతుని న్శంకరున్
నానాదేవవరేణ్యునిన్ హరు జగన్నాథు న్మహాదేవునిన్
జ్ఞానానందమయస్వరూపుఁ డగు నా సర్వేశ్వరుం గొల్చెదన్. 1

మ. హిమవత్పుత్రిక యై మహామహిమతో నీరేడులోకంబులం
గ్రిమరీతిం దగఁ బ్రోచునీశ్వరునకుం గారాబపున్ రాణి యై
విపులం బౌమతి నెల్లలోకములలో విఖ్యాత యై యొప్పున
క్కమలాక్షి న్వినుతింతు నా మదిని శ్రీకాత్యాయనీదేవినిన్. 2

శా. శ్రీరామామణి యైన లక్ష్మి గరిమన్ సేవింప సర్వామరుల్
కారుణ్యాం బలరార రేలుఁ బవలుం గైవారముల్ సేయఁ గా
బారావారమునందు శేషునిపయిం బన్నుండు వైకుంఠుఁ డా
నీరేజాక్షుఁ డనంతుఁ డాద్యుఁడు దయ న్వీక్షించి మ మ్మేలుతన్. 3

చ. కమలమునన్ జనించియును గౌరవ మార సముద్రపుత్రి యై
కమలదళాయతాక్షునకుఁ గామిని యై ధరణీతలంబులోఁ
గ్రమమున నెల్లవారలకుఁ గల్మి నొసంగుచుఁ బ్రోచుచు న్మఱి శ్రీ
రమణి త్రిలోకసుందరి నిరంతరము న్మముఁ గాచుఁ గావుతన్. 4

క. హరిపొక్కిలిసరసిజమున, గరిమంబున జన్మ మొంది కడువేడుకతో
ధరణీస్థలి సృష్టించిన, పరమాత్ముం డగువిధాతఁ బ్రణుతి యొనర్తున్. 5

ఉ. తెల్లనిచాన యై పరఁగి దేవవరేణ్యుఁడు నల్వరాణి యై
చల్లనివాలుఁజూపులను సర్వజగంబుల నేలుచుండునా
తల్లి మహాప్రభావనిధి భారతి విద్యల కెల్ల దేవి యా
హల్లకపాణి వాణి సదయామతిఁ గోర్కులు మా కొసంగుతన్. 6

ఉ. ఎవ్వని రాకచే జగము లెంతయుఁ దేజము నొందుచుండునో
యెవ్వనికై సమస్తజను లీధరణీస్థలి వేచి యుందురో
యెవ్వఁడు చీఁకటి న్వడి హరించునొ భక్తుల నాదరించునో
యవ్వనజాతమిత్త్రిని మహాత్ముని భాస్కరునిం భజించెదన్. 7

చ. పలుకుల కెల్ల నాథుఁడయి పాపవినాశకుఁడై ధరిత్త్రిలో
నలహరుముద్దుబిడ్డఁడయి యన్నిఁటియందును విఘ్ననేతయై
వెలసి గణేశ్వరుం డనెడు పేరఁ జెలంగినయమ్మహాత్మునిన్
నలిమలపట్టిపట్టి యగువాని వినాయకునిన్ భజించెదన్. 8

శా. వేదంబు ల్విభజించి మౌనివరుఁడై విజ్ఞానియై పుణ్యుఁడై
యాదిం బంచమవేదమై విమల మహాభారతాఖ్యానమున్
మోదం బొప్ప రచించినట్టిత్రిజగత్పూజ్యున్ బవిత్రున్ ఘనున్
వేదవ్యాసుని సన్నుతింతు సతమున్ విజ్ఞాన మేపారఁగన్. 9

మ. ఘనుఁడై తాఁ గవిరాజునై సుగుణియై ఖ్యాతిం బ్రకాశించుచుం
దన పేరన్ రచియించి భారతము నీధాత్త్రీతలం బందుఁ జే
ర్మినిఁ బెంపొందెడునట్టిసత్కవివరున్ శ్రీపాదకృష్ణాఖ్యు నా
జనకున్ భక్తి భజింతు సంతతనమస్కారంబు లర్పించుచున్. 10

తే. ఘనులఁ బూర్వకవీంద్రుల మనమునందు
నిల్పి ధ్యానించి యెంతయు నిర్మలముగ
గురువరేణ్యుల నాత్మలోఁ గొలిచి భక్తి
గ్రంథ మొక్కండు రచియింపఁ గడఁగికొంటి. 11

సీ. రాజమహేంద్రివరమున భారతకథా,మృతము వ్రాయంగ నామతిఁ దలంచి
గుంటూరుపురమునఁ గోరికతో నాది,పర్వము సాంతము వ్రాసి యుంటి
నవల నెల్లూరున నాసభారణ్యవి,రాటపర్వంబుల వ్రాసి యుంటి
నానరబళ్ళారిలోనుద్యోగమును భీష్మ,మును ద్రోణమునుమఱియును గ్రమముగఁ
తే. గర్ణశల్యసౌప్తికములు కామినియును,శాంతిపర్వముమఱి యనుశాసనికము
నశ్వమేధమాశ్రమవాసమంతమౌస,లమునవలమహాప్రస్థానికమునుమఱియు.

వ. అనంతరంబ స్వర్గారోహణమును రచించి. 13

ఆ. పదియునెనిమిదైనపర్వసంగ్రహముల, భారతామృత మనుపేర వ్రాసి
నీకు భక్తితోడ నే సమర్పించితి, దీనిఁ జిత్తగింపు దేవదేవ. 14

వ. అని యిష్టదేవతాప్రార్థనాదికం బొనరించి పరమపావనం బగుమహాభారతమున నత్యంతాభిలాషం గలిగి సంగ్రహముగా భారతము రచించి సర్వాంతర్యామి యగుభగవానున కంకితముగా నాయొనర్పం బోవు భారతకథామృతంబునకుఁ గథాప్రకారం బెట్టి దనిన 15

## —• కథాప్రారంభము. •—

క. జనమేజయభూరమణుం, డనఘుఁడు జనవినుతసర్పయాగము సాంతం
బొనరించి భారతంబును, విన వేడుక గలిగి యుండె విజ్ఞానమునన్. 16

ఉ. ఆసమయంబునం దట మహాత్ముఁడు సత్యవతీతనూజుఁ డా
వ్యాసుఁడు లోకవందితుఁడు భారతవంశవిభూషణంబు నై
భాసిలుమౌనిచంద్రుఁడు విభాకరతేజుఁడు వేదవిన్మహో
ల్లాసుఁడు శిష్యసేవితుఁ డిలాపతిఁ జూడఁగ నేగుదెంచినన్. 17

క. కని యెదురు వోయి యప్పు డా, జనమేజయచక్రవర్తి సాత్యవతేయున్
గొని తెచ్చి యర్ఘ్యపాద్యము, లనువలరఁగ నొసఁగి యిట్టులనె వినయమునన్.

చ. పరమదయానమేతు లగువారలు ధర్మగుణైకభూషణుల్
దురితవిదూరులుం ఘనులు త్రోయజనాభునిప్రాణమిత్రముల్
సురుచిరరూపవంతులును శుద్ధమనస్కులు నైనపాండుభూ
వరవరపుత్రరత్నములభవ్యచరిత్ర వినంగఁ గోరితిన్. 19

చ. ఘను లగుపాండుసూనులును గష్టులు దుష్టులు ధార్తరాష్ట్రులున్
మును సమరం బొనర్చి రట ముఖ్యులు నీవు నదీసుతాదులున్
గనుఁగొను చుండ న ట్లిటులు కల్గెనొ నే వినఁ గోరి యుంటి నా
వినుతచరిత్ర మంతయును వీనులవిందుగ నాకుఁ జెప్పవే. 20

వ. అని ప్రార్థించినఁ బారాశర్యుండు ప్రసన్నచిత్తుం డై తనశిష్యుని వైశంపాయనునిం గాంచి జనమేజయుండు భారతకథాశ్రవణానందపరవశుం డై యుండె నారచించిన మహాభారతం బీతనికి సాంతంబుగ విన్నవింపు మని నియోగించి తాను శిష్యగణమ్ముతో వేంచేసె నంత. 21

క. ఆవైశంపాయనముని, భావంబున భక్తితోడఁ బారాశర్యున్
సేవించి భారతంబును, భూవరునకుఁ దెలిపె నిట్లు పూర్ణప్రజ్ఞన్. 22

వ. ఆతండు ముందు దానిమాహాత్మ్యం బెఱింగింపం దలంచి. 23

ఉ. భారతసత్కథామృతము పంచమవేద మనంగ నొప్పు నా
భారత మెల్లకాలమును వ్రాసి పఠించుచు నున్నవారికిన్

గోరిక లెల్ల దీరెడును గూరును సంపద లెల్ల సౌఖ్యముల్
వారు పవిత్రు లయ్యెద రవారితకీర్తివిశాలమూర్తు లై. 24

క. నిత్యము శుచు లై మానవు, లత్యంతపవిత్ర మగుమహాభారతమున్
శ్రుత్యనుకూలత విను నెడ, నిత్యంబుగఁ గలుగుసర్వసౌఖ్యంబు లిలన్. 25

తే. గోవులకు స్వర్ణమయముగఁ గొమ్ము లిడుచు
వేదవిదు లయి యలరారువిప్రులకును
దాన మిచ్చినంత ఫలంబు తప్పకుండఁ
గలిగెడును మహాభారతాఖ్యానము విన. 26

చ. భరతకులప్రదీపకులభవ్యచరిత్రము నాలకించినన్
నరకముఁ గాంచువా రయిన నాకముఁ గాంతురు పాపదూరు లై
నిరతము దీని మానవుఁడు నిష్ఠఁ బఠించు నెడం గృతార్థుఁ డౌ
బరమపదంబుఁ జేరుటకుఁ బాయనిమిత్రము భారతం బగున్. 27

ఉ. ఇందున లేనిధర్మము ల వెందును లేవు తలంచి చూడఁ గా
నిందుఁ గలట్టిధర్మము ల వెందును లే వన నేల వేదమే
యిందుల నుండు నీచరిత మెవ్వఁడు గాని పఠించు నేని యా
నందముఁ బొందు సౌఖ్యము లనారతముం గొను నిందు నందుఘన్. 28

క. పావన మగునీకావ్యం, బే వేళఁ బఠించువార లిలఁ బాపములన్
వేవేగఁ బాసి పుణ్యము, దేవత్వముఁ గాంచఁ గలరు తేజస్స్ఫూర్తిన్. 29

తే. అజుఁడు మొదలుగ నిదివఱ కైనపూరు
వంశవృత్తాంత మెఱిఁగింప బ్రహ్మకేని
వశము గాదు నానేర్చినపగిది నీకుఁ
దెలియఁ జెప్పెద విను మయ్య! సలలితాత్మ. 30

వ. అని వైశంపాయనుండు జనమేజయునకుఁ బూరువంశవృత్తాంతసంగ్రహ మెఱింగించి మహాభారతగ్రంథరచనాధురంధరుండును భారతవంశమూలపురుషుండును నగు వేదవ్యాసునిపవిత్రచరిత్ర మి ట్లని చెప్పం దొడంగె.

### —— సత్యవతీ పరాశరుల వృత్తాంతము ——

క. మును యమునానది నద్రిక, యనునచ్చర లేమ యొకతె యజుశాపవశం
బున మీనం బై యుండెను, గనుఁగొనఁ గాఁ గొన్ని వేలఘనవర్షంబుల్.

చ. వసు వనురాజశేఖరుఁడు పావన మౌయమునాతటంబునం
బూనఁ గెడుపూలతోఁటకును బోయి విహార మొనర్చు చున్నెడన్

వసుధరణీధవుండు తనభాసురతేజము వీడె నద్ది యా
వెసఁగొనగ నానదిం బడియె నెంచఁ దరంబె విధాతచెయ్వులన్. 33

క. ఆవసునృపాలు తేజము, వేవేగమె మీను దాని వెస గర్భిణియై
తా వెలసి పదియు మాసము, లావెంబడిన్ మోచె దాని నతిభారముగన్.

తే. అంతటను దశమాసము లైన వెనుక, వచ్చి జాలరుల్ వలలను దెచ్చి వైచి
మత్స్యమును బట్టుకొని తీసి మసుకతోడ, దానిపొట్టను విచ్చిరి దరికి నీడ్చి

వ. అందు దివ్యసుందరాకారులై దశదిశలం దీపింపఁ జేయునొక మగ
శిశువు నొకయాఁడుశిశువు నుండఁ గాంచి జాలరులు హర్షించి యక్క
వలం దెచ్చి వసునృపాలున కొసంగి తమతావుల కేగి రంత. 36

ఆ. అజునివలనఁ దనకు నైనశాపము వాసి, యద్రికాఖ్యతోడ నపుడు మీను
దేవలోకమునకు వేవేగఁ జనిసురాంగనల గూడి వేడ్కఁ దనరుచుండె.

వ. అంత వసుమహీవల్లభుండు. 38

చ. కొమరుని మత్స్యదేశమునకుం బతిఁ జేసెను మత్స్యరాజు నా
గొమరితె మత్స్యగంధి యని కూరిమిఁ బిల్చుచు దాశరాజులోఁ
గొమరులు లేక కుంద విని కోరికి దీరఁగఁ బెంప నిచ్చి భూ
రమణవరేణ్యుఁడై నవసురాజు ధరాతల మేలె మేలనన్. 39

వ. మత్స్యగంధి దాశరాజుకడ నాత్మజయుం బోలెఁ బెరిగి యుల్లసిల్లుచు శుక్లపక్ష
క్షపాకరరేఖయుం బలె దినదినప్రవర్ధమాన యై తండ్రియాజ్ఞ జేసి
పరోపకారం బెంచి యమునానది నోడ నడపుచుండె నంత. 40

చ. పరమతపోధనోత్తముఁ డపారమహత్త్వసమేతుఁ డప్పరా
శరముని తీర్థసేవలను సల్పుచు నయ్యమునానదీతటాం
తరమున కేగి యద్దరికి దాటఁగ నెంచుచు నోడ నెక్క నా
సరసిజనేత్ర సత్యవతి చయ్యనఁ ద్రోసెను నావ నయ్యెడన్. 41

క. మునివరుఁడు మత్స్యగంధిని, గనుఁగొని నాసోయగంబు కనులక నపుడీ
అను గాంచినంతనాతఁడు, ఘనతరమోహంబు బొందెఁ గాంతామణిపై.

వ. మహాతపస్సంపన్నుం డగు పరాశరుం డాసరోజాననపై విరాళిం జెందిన
మదిం ద్రిప్పుకొన లేక యిట్లని తలపోయుచుండె. 43

ఉ. చక్కనివారిలో మిగులఁ జక్కని దై రతవంపుబొమ్మయై
చక్కరబోఁడి నామనము చయ్యనఁ దాను హరించె నీమెతో

మక్కువ దీరఁగా నిపుడు మాటికిఁ గూటమి గల్గ కుండినన్
దక్కదె నాకుఁ బ్రాణములు దక్కవిఁ కేమి యొనర్తు దైవమా. 44

ఉ. కాంచనగర్భుఁ డెంతయును గాంచనపుత్రిక కాయ మోసిన
ట్లెంచఁగ నయ్యె నేఁ డిచట నిందుముఖీమణిఁ జూచినంత నేఁ
గాంచినదాదిగా నిపుడు కాముని బారికి జిక్కి యుంటి నీ
కాంచనగంధితో ముదము గల్గఁగ నే నెటు మాటలాడుదున్. 45

క. చిఱునగవు చంద్రికలవలెఁ, బరఁగ న్నెమ్మోము సొంపు పద్మముఁ బోలెన్
వరవర్ణనీయ యగు నీ, తరుణీమణిఁ గూడ కెట్లు తాళుదు నకటా. 46

క. పిలిచి యెటు మాటలాడుదుఁ, బిలిచినఁ గోపించునొక్కొ విమలాంగిని నేఁ
బిలువక యిఁ కెట్లు తాళుదుఁ, జెలువల మేల్బంతి నెట్లు చేరుదునొక్కొ.

క. అని యమ్మౌనివరేణ్యుఁడు, ఘనుఁడైన పరాశరుండు కడుమోహముతో
ఘనతరసౌందర్యము గల, వనజాననఁ గాంచి యిట్లు పలికెం గడఁకన్.

ఉ. ఎవ్వరిదాన వెవ్వతెవొ యెందుల కియ్యెడ నున్నదానవో
జవ్వని! నామ మెయ్యదియొ చక్కదనాలకు నిక్క మైన నీ
వెవ్వరొ యోడమీఁద నిటు లేమిటి కుంటి వటంచుఁ బల్కఁగా
నవ్వనజాయతాక్షి యపు డామునినాథునితోడ నిట్లనున్. 49

చ. మునివర! దాశరాజునకుఁ బుత్రిక నాదు మత్స్యగంధి నాఁ
దనరుదు ధర్మమార్గమునఁ దండ్రియనుజ్ఞను నౌకఁ ద్రిప్పుచున్
జనులకు రాకపోకలను సల్పుచు నుందు నటంచుఁ దెల్పినన్
మునివరుఁ డిట్లు పల్కె వసుపుత్రికతో నతిమోహమగ్నుఁడై. 50

ఉ. కాంతరొ! నీదు సుందరతఁ గాంచిన నాకు విరాళి యయ్యె నేఁ
గంతుని బారిఁ జిక్కితిని గావుము నీయధరామృతంబు నా
కింత యొసంగకుండు నెడ నే నెటు మేను భరింతు నన్న న
య్యింతుల మేలుబంతి యపు డిట్లను నమ్మునినాథమూర్తితోన్. 51

ఉ. ఈవు మహామహుండవు మునీంద్రకులాభరణంబ వెన్నఁగా
నీవు మునీంద్రచంద్రుఁడవు నీచకులంబున నైనదానినిన్
దావి నసహ్యమై తనరుదానిని గన్నియ నైనదాని న
న్నీవెటు లంటఁ గోరితివొ నే వివరింపఁగఁ జాల నక్కటా. 52

తే. మీనుపోలు సువాసన గలమేనిదానఁ, దల్లిదండ్రులచాటున నున్నదానఁ
గన్నె నే నిన్నుఁ గూడినఁ గాంచిరేని, తల్లితండ్రులు నడపింతు రిల్లు వెడల.

ఆ. తపము చెడును గాదె తాపసేశ్వర! నన్నుఁ, నీవు గోరునంత నిమిషమునంద
తపము చెఱుప నేల తప్పు సేయఁగ నేల?, ప్రమతో వఁజనుము నీవు తొలఁగి.

వ. అనిన నప్పల్లవాధరిం గాంచి మునితల్లజుండు ప్రాలుఁగంటీ! నీవు జాలరి
దానవు కావు వసునృపాలపుత్రికవు దివ్యదృష్టిం జేసి నీచరిత్రము నా కా
ద్యంతంబుం దెలియ నయ్యె నాకోర్కిం దీర్పుము నీకన్యాత్వంబు దూషి
తంబు గాకుండు నియ్యది దైవనిర్మితంబు నీకు నావలన వంశోద్ధారకుం
డగు నందనుం డుదయించు నన నమ్మందయాన యి ట్లనియె. 55

క. మునినాథ! చూడు మల్లదె, జను లెల్లరు దిరుగు పగటిసమయం బిది యే
నిన్నుఁ గూడు టెట్టులనన్నా, ముని తమముం బర్వఁ జేసెఁ బోఁడిమి నచటన్.

ఆ. తమము పర్వఁ జేసి కమలాయతాక్షినిఁ, జేరఁ దాఁకు నంత శీఘ్రముగనె
మీనుపొలసుకంపు మేనును విడి సుగంధమ్ము లందుకొనియెఁ దన్వి కంత.

వ. పరాశరహస్తసంస్పర్శంబు వలనం గలిగిన సుగంధ మ్మొక యోజనమ్ము
దాఁక వ్యాపించుం గావున నామెకు యోజనగంధి యనియు గంధవతి
యనియు నామంబు లేర్పడియె నంత. 58

క. తనపూర్వజన్మమునకుం, దన మేనం గలిగినట్టి తావికి మదిలో
ఘన మైనమోదమందుచు, వనజానన మానికోర్కి వాసిగఁ దీర్చెన్. 59

వ. అంత నయ్యోజనగంధి సద్యోగర్భముం దాల్చి. 60

—• వ్యాసుని జన్మప్రకారము •—

మ. ఘనునిన్ దండకమండలుప్రథితునిం గాంతిచ్ఛటాధామునిన్
ఘననిష్ఠాపరుని న్మహామహునిఁ గృష్ణప్రస్తుతాకారునిన్
మునిలోకప్రచయాధినాథుని జటాభూషావిశేషాంచితున్
గనియెన్ వ్యాసుని భారతాన్వయగురున్ గంజాతునంశంబునన్. 61

వ. సర్వవిద్యానవద్యుండును వేదధర్మోద్ధారకుండును భారతగ్రంథకర్తయు
నగు వేదవ్యాసుండు జన్మించి వెంటన పెరిగి పెద్దవాఁడై తల్లికి మ్రొక్కి
నీ వెప్పుడు పిలిచిన నప్పుడ వత్తు నని విన్నవించె నంత. 62

ఆ. ఆపరాశరుఁడు మహాత్ముఁ డయ్యోజన, గంధిఁ గాంచి పలికెఁ గడఁకతోడ
నాదుకోర్కి దీరె నాతి! శంతనురాజ, పత్ని వగుదు వీవు భాసురముగ. 63

వ. అని యాశీర్వదించి వేదవ్యాసునితోఁ దపోవని కేగె నంత. 64

క. సంచితపుణ్యుఁడు వ్యాసుఁడు, పంచమవేదం బనంగ భారతమును ము
న్నంచితగతి వ్రాసెను లో, కాంచితమహనీయమూర్తి యాతఁడు తలఁపన్.

క. కురువంశం బని యొకసా,గర మభివర్ణింప నేరు గల రీధరలో
సరసిజగర్భుండు చాలండు, నరు లెంతటివారు తెలుప నరనాథమణీ. 66

—• యయాతివృత్తాంతసంగ్రహము •

వ. ఆకౌరవవంశంబున ననేకులు రాజ్యము పాలించినయనంతరంబ నహుషుండు పట్టాభిషిక్తుండై యతి యయాతి సంయాతి మొదలగునార్వురు పుత్రులంగాంచి దివి కేగె యతి తపోనియతి నుండుటయు యయాతి రాజై పూజ్యసామ్రాజ్యపట్టాభిషిక్తుండై ధరిత్రీచక్రం బవక్రవిక్రమంబునం బరిపాలించుచు. 67

తే. దేవయాని శర్మిష్ఠనుం దేజమలరం, బరిణయంబై యయాతి భూవల్లభుండు
రాజసూయాధ్వరంబుల్ రాణలెసంగ, జేయుచును రాజ్యపాలనాస్థితి నెసంగి.

తే. దేవయానీరమణియందు దేజములరం గాంచెనిర్వురసుతుల భూకాంతుండవల
ముదితశర్మిష్ఠ వలనను ముగురుసుతులం గాంచె వంశభూషణులలో కాంచితులను.

వ. అనంతరం బయ్యయాతి శుక్రశాపంబున యౌవనం బుడిగి జరాభారపీడితుండై కామాభిలాషం దగిలి తనయేవురు పుత్రులం గాంచి నాముదిమిం గైకొని మీయౌవనంబు నాకొసంగుం డవల మీయౌవనంబు మీకొసంగి నాముదిమి నేను గైకొందు నాయభిలషితమ్ము తీర్చినవాండే నారాజ్యార్హుండగు ననిన నల్వురుపుత్రులు సమ్మతింపమియుం బూరుండు పితృమనోరథంబు దీర్పం దలంచి తన యౌవనమాతని కొసంగి యాతని ముదిమిం గైకొనియె యయాతి నూతనయౌవనంబున విరాజిల్లుచుం దనమనోభిలాషం దీర్చుకొని సహస్రవర్షములయనంతర మాపూరుని యౌవనంబు వాని కొసంగి తనముదిమిం దాను గైకొని పూరునకుం బూజ్యసామ్రాజ్యపట్టాభిషేక మొనర్చి తపోవని కేగె నంత. 70

ఉ. భారతవంశభూషణుం డపారపరాక్రమశాలి యైనయా
పూరుం డిలాతలేశుం డయి పొల్చి ఘనం బగునట్టియాగముల్
సారమతిం బొనర్చి గుణసాగరుం డై విభవాభిరాముం డై
ధారుణి రాజ్య మేలుచును ధర్మము నిల్పుచు నుండె నెయ్యెడన్. 71

క. సురనాయకునిం బోలెను, బరమైశ్వర్యంబుతోడ భాసిల్లుచు నా
ధరణీశ్వరుండు పూరుం, డరుదారగ రాజ్య మేలె నాకాలమునన్. 72

వ. అంత నప్పూరుండు పౌష్టి యనుసతియందుం బ్రవీరుం గాంచె వాని యందు శక్తుండు మొదలుగా బహునన్మదితరంబుల కవ్వల నీలుం డను వానికి రథంతరి యనుకాంతయందు దుష్యంతుండు జన్మించి సార్వభౌముండై చతుస్సముద్రముద్రితమహీచక్రం బవక్రవిక్రమంబునం బరిపాలించు చుండె. 73

## రాజపోషకులు.

శ్రీ రాజా తడకమళ్ళ సీతారామచంద్రరావు బహద్దరుగారు—చేబ్రోలు.



### ఈపత్రికకు చందానిర్ణయము.

| | | | | |
|---|---|---|---|---|
| రాజపోషకులకు సం॥రం 1 టికి | | ... | ... | రు50—0—0. |
| ప్రధానపోషకులకు. | ... | ... | ... | రు25—0—0. |
| పోషకులకు. | ... | ... | ... | రు12—0—0. |
| సహాయులకు. | ... | ... | ... | రు 6—0—0. |
| చందాదారులకు. | ... | ... | ... | రు 3—0—0. |

---

రాజమహేంద్రవరమున శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారిచే సరస్వతీ పవర్ ప్రెస్ నందు ముద్రితమై కవిరాజు శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారిచేఁ బ్రకటింపఁబడినది. 1925.